# Delhi School of Scandals

THE CONGRESS party and corruption have become synonymous. Except for the late prime minister Lal Bahadur Shastri, all Indian prime ministers, including those belonging to the Janata Party and Janata Dal, were tainted with charges of corruption and nepotism. Infact, corruption seems to have become the long term policy of the government and even when Congressmen change political parties they pursue this "national ethos" with patriotic fervour.

* * *

The socialistic and secular minded leftist parties are the same. Nor were the Telugu Desam Party (TDP), AIDMK, and former BJP government in Madhya Pradesh free from graft charges. And at the centre and at state level, the Congress-I has not only excelled in championing courruption but has lent it a certain degree of sophistication. Politicians have consistently striven to convince society that corruption is the demand of realpolitik.

* * *

Immediately after independence in 1948, the country's first prime minister Jawaharlal Nehru defended his close associate and scholarly diplomat VK Krishna Menon who was charged with entering into irregular deals for military ware worth Rs.80 lakh in what was then known as the 'jeep scandal.' Not content with closing the case, the government appointed Menon as a cabinet minister.

* * *

It was Feroze Gandhi who spearheaded the exposure of the Mundhra deal in parliament in 1957, in which Life Insurance Corporation (LIC) and industrialist Haridas Mundhra were involved. A sum of Rs.1.25 crore was involved, nothing in comparison with the dimensions of the present scam, but the then finance minister, TT Krishnamachari, actually resigned once it emerged that he had tried to hide information on the subject The Chagla commission found TTK guilty of authorising investment in Mundhra shares by LIC.

* * *

As if these scandals were not enough, then minister of mines and fuel KD Malaviya was revealed to have set up a deal for a fellow Congressman, fighting an election in UP, with a businessman likely to contribute to his campaign. Only Rs.10,000 was involved and the Congressman obtained it, but Malaviya was forced to resign.

* * *

From the very begining Nehru adopted a protective and patronising air towrads fellow Congressmen, especially those facing charges of corruption. The Supreme Court had found Punjab chief minister Pratap Singh Kairon guilty of 'improprieties' but Nehru defended him. It was only when Shastri took over that Kairon was forced to resign following the publication of the finding reports. Another chief minister Bakshi Gulam Mohammed of Jammu and Kashmir was also accused in 1953 of corruption, but he continued in power for almost ten years

* * *

After Indira Gandhi took over things got worse. The Nagarwala case cast its shadow over those in the highest levels of government and many unanswered queries pointed towards Gandhi In this bizzare case, an amount of Rs.60 lakh was withdrawn from the State Bank of India in Delhi allegedly following a telephone call from Gandhi to its cashier Ved Prakash Malhotra.

* * *

The Tul Mohan Ram scandal in 1974 kept corrupt practices in the limelight. The foreign trade ministy was sent a representation purportedly signed by 21 MPs recommending import licences to private parties. Of them 18 signatures were found to be forged by Tul Mohan Ram, MP. The following year Indira Gandhi hereself was found guilty of corrupt electoral practices by the Allahabad High Court in 1975. Instead of resigning, she declared Emergency.

* * *

Former opposition MP Surendranath Dwivedy, in his article 'Fight Against Corruption' said that "even a politically motivated campaign based on vague and unverified charges of corruption against Kanti Desai (son of former prime minister Morarji Desai) by the Congress has to be given a better and different treatment. It is not enough if one is fully conviced that one has committed nothing wrong, but a person holding a position of responsibility has to convince the larger public outside that his action is right."

# మిసిమి

***"All that we are is the product of what we have thought,' is "We are what we think."*** **– Dammapada.**

సంపుటి 4 జూన్ 1993 సంచిక 12

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

ముఖచిత్రం
కీలుగుఱ్ఱం

# LIVING DICTIONARY
## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Hurricane,** *n.* An atmospheric demonstration once very common but now generally abandoned for the tornado and cyclone. The hurricane is still in popular use in the West Indies and is preferred by certain old-fashioned sea-captains. It is also used in the construction of the upper decks of steamboats, but generally speaking, the hurricane's usefulness has outlasted it.

**Hurry,** *n.* The dispatch of bunglers.

**Husband,** *n.* One who, having dined, is charged with the care of the plate.

**Hybrid,** *n.* A pooled issue.

**Hydra,** *n.* A kind of animal that the ancients catalogued under many heads.

**Hyena,** *n.* A beast held in reverence by some oriental nations from its habit of frequenting at night the burial-places of the dead. But the medical student does that.

**Hypocrite,** *n.* One who, professing virtues that he does not respect, secures the advantage of seeming to be what he despises.

**Idleness,** *n.* A model farm where the devil experiments with seeds of new sins and promotes the growth of staple vices.

**Illuminati,** *n.* A sect of Spanish heretics of the latter part of the sixteenth century; so called because they were light weights- *cunctationes illuminati.*

**Illustrious,** *adj.* Suitably placed for the shafts of malice, envy and detraction.

**Imagination,** *n.* A warehouse of facts, with poet and liar in joint ownership.

**Imbecility,** *n.* A kind of divine inspiration, or sacred fire affecting censorious critics of this dictionary.

**Immigrant,** *n.* An unenlightened person who thinks one country better than another.

**Impartial,** *adj.* Unable to perceive any promise of personal advantage from espousing either side of a controversy or adopting either of two conflicting opinions.

**Impenitence,** *n.* A state of mind intermediate in point of time between sin and punishment.

**Impiety,** *n.* Your irreverence toward my deity.

**Impostor,** *n.* A rival aspirant to public honors.

**Improvidence,** *n.* Provision for the needs of to-day from the revenues of tomorrow.

**Impunity,** *n.* Wealth.

**Incumbent,** *n.* A person of the liveliest interest to the outcumbents.

**Indifferent,** *adj.* Imperfectly sensible to distinctions among things.

> "You tiresome man!" cried Indolentio's wife,
> "You've grown indifferent to all in life."
> "Indifferent?" he drawled with a slow smile;
> "I would be, dear, but it is not worth while."
> *Apuleius M. Gokul.*

***Indiscretion,*** *n.* The guilt of woman.

**Inexpedient,** *adj.* Not calculated to advance one's interests.

**Infancy,** *n.* The period of our lives when, according to Wordsworth, "Heaven lies about us." The world begins lying about us pretty soon afterward.

సంస్మరణ వ్యాసం:

## ప్రాచీన భౌతికశాస్త్రమును సులభతరం చేసిన

# దేవీప్రసాద్ చటోపాధ్యాయ

- టి. రవిచంద్

మే నెల 8వ తేదీన కలకత్తాలో మరణించిన దేవీప్రసాద్ చటోపాధ్యాయ (1918 - 1993) సమకాలిక భారతీయ మార్క్సిస్టు అధ్యయన పరుల్లో, చరిత్రకారులలో సుప్రసిద్ధులు. దేవీప్రసాద్ చటోపాధ్యాయ అంటే కాంగ్రెస్ ప్రభుత్వంలో మంత్రిపదవి చేపట్టిన చటోపాధ్యాయ కాదు; ప్రాచీన భారతీయ భౌతిక వాదంపై ''లోకాయత - ఏస్టడీ ఇన్ ఏన్‌షెంట్ ఇండియన్ మెటీరియలిజమ్'' (లోకాయత - ప్రాచీన భారతీయ భౌతికవాదంపై ఒక అధ్యయనం) అనే గ్రంథాన్ని రచించిన మార్క్సిస్టు పరిశోధకుడు. ప్రాచీన భారతీయ భౌతికవాదంపై మార్క్సిస్టు పరిశోధన అన్న వెంటనే స్ఫురణకు వచ్చే మార్క్సిస్టు మేధావి. ఆయన మన సమకాలిన మార్క్సిస్టు తత్వవేత్త. మార్క్సిస్టు అవగాహనతో భారతీయ తత్వశాస్త్రం, మతం, సంస్కృతికి సంబంధించిన అనేక విషయాలపై లోతైన పరిశోధనలు చేశారు. మౌలిక గ్రంథాలు వెలువరించారు. 1959లో ప్రాచీన భారతీయ భౌతికవాదంపై ఆయన చేసిన రచన ''లోకాయత'' ద్వారా లోకాయత చటోపాధ్యాయగా ప్రసిద్ధి చెందారు.

డా. ఎస్.ఎన్. దాస్‌గుప్త ('భారతీయతత్వ శాస్త్ర చరిత్ర'), డా. ఎస్. రాధాకృష్ణన్ ('భారతీయ తత్వశాస్త్రం') భారతీయ తత్వ శాస్త్రంపై రాసిన గ్రంథాలు ఉద్గ్రంథాలుగా విద్యావంతులకే పరిమితం కాగా, దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ ''భారతీయ తత్వ శాస్త్రం - సులభ పరిచయం'' పాండిత్య ప్రకర్షలేని జనరంజక రచనగా పాటకజనానికి అధ్యయన గ్రంథమైంది. ఆయన దృష్టిలో తత్వశాస్త్ర అధ్యయనం కేవలం వినోదం కోసమో, పాండిత్య ప్రదర్శన కోసమో కాదు; దానికొక నిర్దిష్ట లక్ష్యం, ప్రయోజనం ఉన్నాయి. ఆ ఉద్దేశంతోనే భారతీయ తత్వశాస్త్రాధ్యయనం కేవలం పండితులకే పరిమితమవకుండ, అది ప్రజలకు, ప్రజోద్యమాలకు ప్రేరణగా నిలవాలన్న లక్ష్యంతో దార్శనిక పరిభాషా గందరగోళం లేకుండా సులభశైలిలో ''భారతీయ తత్వశాస్త్రం - సులభ పరిచయం'' (1964) అనే గ్రంథాన్ని రచించారు. సులభశైలిలో ప్రజలకు తత్వశాస్త్రాన్ని పరిచయంచేయడమే కాకుండా కాల గర్భంలో కలిసిపోయిన అనేక దార్శనిక (తాత్విక) సాంప్రదాయాల్ని వెలికితీసి, మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషించి గ్రంథరచన చేశారు. ప్రాచీన దార్శనిక సాంప్రదాయాల్ని హృదయానికి హత్తుకొనేటట్లు చెప్పగల ప్రతిభాశాలి. ఎంతటి క్లిష్టవిషయాన్నయినాసరే సాంకేతిక పదాల గందరగోళం లేకుండా సులభ పరిచయం చేయగల సమర్థులు. 1942లో కలకత్తా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. డిగ్రీ పరీక్షలో ప్రథమశ్రేణిలో ప్రథముడిగా ఉత్తీర్ణుడయిన నాటినుండి దాదాపు నాలుగు దశాబ్దాలకి పైగా వివిధ కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో ఉపన్యాసకుడిగా, ఆచార్యుడిగా పనిచేసి సంపాదించిన అనుభవంతో ఈ గ్రంథరచన చేశారు. ఆయన రచనలు భారతదేశంలోనూ, విదేశాల్లోనూ అనువాదంచెందాయి. వాటిలో ''లోకాయత'' (1959)'', భారతీయ తత్వశాస్త్రం'' (1964), ''భారతీయనాస్తికత్వం'' (1969), ''భారతీయ తత్వశాస్త్రంలో సజీవమూ - నిర్జీవమూ'' (1976), ''ప్రాచీన భారతంలో శాస్త్రం - సమాజం'' (1977) ''లెనిన్ - దార్శనికుడు'' (1979), ''ప్రాచీన భారతీయ శాస్త్ర, సాంకేతిక విద్యల చరిత్ర'' (1982), ''మతం - సమాజం''

(1987), ''ప్రాచీన భారతీయ భౌతిక వాద సమర్థన'' (1988), ''బేకన్ నుండి మార్క్స్ వరకు తత్వశాస్త్రం'' (1991), ''తత్వశాస్త్రం - భవిష్యత్తు'' (1993) అనేవి ముఖ్యమైనవి. ఇంకా ఆయన సంపాదకత్వంతో అనేక గ్రంథాలు వెలువడ్డాయి. 1608 సంవత్సరంలో తారానాథుడనే టిబెట్ చరిత్రకారుడు ''భారతదేశంలో బౌద్ధమత చరిత్ర'' (History of Buddhism in India) అనే గ్రంథాన్ని రచించాడు. ప్రాచీన, మధ్య యుగాల్లో భారతదేశ చరిత్ర, దానిలో భాగమైన బౌద్ధ మతాన్ని అధ్యయనం చేయడానికి ఉపకరించే మూల గ్రంథాలలో (Source Books) ఇది చాలా ముఖ్యమైనది. దీన్ని లామాచింప, అలాకా ఛటోపాధ్యాయులు టిబెట్ భాష నుండి ఆంగ్లంలోకి అనువాదం చేయగ దానికి సంపాదకత్వ బాధ్యత వహించింది చటోపాధ్యాయ. సంపాదకత్వం అంటే ఇలా ఉండాలి అని నిరూపించే ఉత్తమ సంపాదక గ్రంథం ఇది. దేవీప్రసాద్ చటోపాధ్యాయకి భారతీయ తత్వశాస్త్రంలో ఉన్న అపారమైన పరిజ్ఞానానికి ఉదాహరణగా ఈ రచనను పేర్కొన వచ్చు. దీనికి రాసిన ముందు మాటలో భారతదేశంలో బౌద్ధమతం అంతరించడానికి గలకారణాల్ని గురించి చటోపాధ్యా సంక్షిప్తంగా లోతయిన చర్చ చేశాడు. భారతదేశంలో ఆంతరంగికంగా బౌద్ధమతం అంతరించడానికి దోహదం చేసిన వివిధ కారణాల్ని పరిశోధించడమనేది చాల ముఖ్యమైన విషయమని పేర్కొంటూ, వివిధ కారణాల్ని విశ్లేషించాడు చటోపాధ్యాయ. నిజానికి ప్రగతిశీల దృక్పథం గల మన చరిత్రకారుల్ని పట్టి పీడిస్తున్న సమస్యల్లో ఇది ఒకటిగా పేర్కొంటే అతిశయోక్తి కాదు. ఈ విషయమై మన చరిత్రకారులు సమగ్రంగా పరిశీలించాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పాడు. ఏదో ఒక కారణం వల్ల బౌద్ధం భారతదేశంలో అంతరించిందనే అభిప్రాయంతో చటోపాధ్యాయ అంగీకరించక పోయినా, ఫ్యూడల్ ప్రభువుల, రాజుల, పెద్ద ధనవంతుల ఆదరణ, అభిమానంపై ఆధారపడి బౌద్ధ సంఘాలు పూర్తిగా మనుగడ సాగించడం కూడ ఒక ప్రధాన కారణమై ఉండచ్చునన్న సందేహం వెలిబుచ్చారు. ఏమయినా మన చరిత్రకారులు ఎటువంటి పూర్వ నిర్ధారిత భావాలకు లోనవకుండ నిష్పాక్షికంగా అధ్యయనం చేయాల్సిన విషయాల్లో భారత దేశంలో బౌద్ధమత పతనం ఒకటి అనడంలో సందేహం లేదు.

చటోపాధ్యాయ అవైదిక (Non-Vedic) దర్శనాలపై వెలువరించిన గ్రంథాలు ప్రగతిశీలు రందరూ గర్వించ దగ్గ రచనలు. తొలిసారి మార్క్సిస్టు సిద్ధాంతం వెలుగులో ప్రాచీన తత్వశాస్త్రాన్ని, ముఖ్యంగా ఆదిమ భౌతిక వాదాన్ని సమగ్రంగా శాస్త్రీయంగా పరిశీలించిన గ్రంథం ఇది. భౌతిక వాద దృక్పథంతో భారతీయ తత్వశాస్త్రాన్ని పరిశీలించటానికి ప్రయత్నంచేసిన ఎం.ఎన్. రాయ్, భూపేంద్రనాథ్ దత్తాల తర్వాత చటోపాధ్యాయను పేర్కొన వచ్చును అని జర్మన్ మార్క్సిస్టు ఇండాలజిస్టు వాల్టర్ రూబెన్ ప్రస్తుతించారు. ఈ విషయం వాస్తవమే అయినా, చటోపాధ్యాయకంటె ముందు దాదాపు ఇరవై అయిదు సంవత్సరాలకు పూర్వమే ప్రాచీన భారతీయ భౌతిక వాదంపై తెలుగువాడైన డా. కె.బి. కృష్ణ (1898 - 1948) ''స్టడీస్ ఇన్ ఇండియన్ మెటీరియలిజమ్'' (హైందవ భౌతిక వాదంలో అధ్యయనాలు) పేరుతో 1932లో హార్వర్డు విశ్వ విద్యాలయంలో ఉండగా, మార్క్సిస్టు తత్వ శాస్త్ర ప్రభావంతో ఒక పరిశోధక గ్రంథాన్ని రచించాడు. ఇండియాలో మొదటి స్థానం కృష్ణగారి (కాట్రగడ్డ బాలకృష్ణ)కే దక్కుతుంది. ఆయన పరిశోధనకు ఎన్ని పరిమితులున్నా చటోపాధ్యాయకంటె ముందు ప్రాచీన భారతీయ భౌతికవాదం తొలి పరిశోధకుడిగా ప్రత్యేక స్థానం వుంది. వాల్టర్ రూబెన్ పేర్కొన్న ఎం.ఎన్.రాయ్, భూపేంద్రనాథ్ దత్తాల సరసన చేర్చాల్సిన తొలితరం భారతీయ మార్క్సిస్టు ఇండాలజిస్టుల్లో డా.కె.బి. కృష్ణ ప్రముఖుడు (ప్రస్తుత వ్యాసకర్త డా.కె.బి. కృష్ణ జీవిత, రచనలపై అధ్యయనం చేస్తున్నాడు). అయితే దేవీప్రసాద్ చటోపాధ్యాయ పరిశోధనలు వచ్చే వరకు ప్రాచీన భారత చరిత్రను, సంస్కృతిని, తత్వశాస్త్రాన్ని శాస్త్రీయ దృక్పథంతో, నిర్దిష్టమైన గతి తార్కిక భౌతికవాదం అవగాహనతో సమగ్రంగా పరిశీలించిన వారు కానీ ఆవైపుగా లోతైన కృషి కాని ఎక్కువగా జరగలేదని చెప్పవచ్చు. ఈ విషయంలో

చటోపాధ్యాయ కృషి గర్వించ దగ్గది. ప్రాచీన తాత్విక సిద్ధాంతాల్ని పరిశీలించేటప్పుడు శాస్త్రీయ పరిశోధకులు, విమర్శకులు ఎటువంటి విధానాన్ని అవలంబించాలో తమ ''భారతీయ తత్వశాస్త్రం - సులభ పరిచయం'' గ్రంథంలో ఇలా అన్నారు: ''మన తాత్విక సాంప్రదాయంలో విలువైన దానిని కాపాడుకోవటం ఎంత అవసరమో, నిర్జీవ మైన దానిని త్యజించటం కూడా అంతే అవసరం. ఏమంటే గతానికి సంబంధించిన తాత్విక భావాలు మన పురోగతికి తోడ్పడవచ్చు లేక అడ్డుకోవచ్చు. కనుక మన ప్రాచీన భావ సంపదలో మన ప్రస్తుత పురోగతికి ఆటంకంగా వున్నవాటిని విమర్శనాత్మకంగా వర్జించాలి. మన పురోగతికి ఇప్పటికీ తోడ్పడే భావాల్ని మాత్రం ప్రత్యేకంగా నొక్కి చెప్పాలి.'' ఈ రోజు ఫ్యూడల్ సంస్కృతికి వ్యతిరేకంగా జరగుతున్న పోరాటానికి ఆయన రచనలు సైద్ధాంతిక పునాదిని ఇస్తాయి. మతవాదాన్ని, బ్రాహ్మణ పునరుద్ధరణ వాదాన్ని ఎదుర్కొనడానికి ఆయన పరిశోధనలు ప్రేరణగా నిలుస్తాయి. గత చరిత్రనీ, సంస్కృతినీ తెలుసుకోకుండా మనం ప్రజా ఉద్యమంలో ఒక్క అడుగు కూడ ముందుకు వేయలేము. ఇదే విషయాన్ని చైనా విప్లవోద్యమకాలంలో రాసిన ''న్యూ డెమాక్రసీ'' (నూతన ప్రజాస్వామ్యం) అనే పుస్తకంలో మావో ఇలా అన్నాడు: ''చైనా ప్రాచీన సంస్కృతి నుంచే చైనా నూతన సంస్కృతి వృద్ధి చెందింది. చరిత్రను మనం తెగగొట్టలేము.''

భూస్వామిక భావాలకి వ్యతిరేకంగా జరగాల్సిన సమరశీల సైద్ధాంతిక పోరాటాన్ని గూర్చి చటోపాధ్యాయ తమ రచనల్లో తరచుగా నొక్కి చెబుతుంటారు. ఈ అంశాన్ని వివరిస్తూ తమ 'భారతీయ తత్వశాస్త్రం'' పీఠికలో ఇలా అన్నారు: ''భూస్వామిక భావాల నిర్మూలనకు అతి ముఖ్యమైన తొలి షరతు - ఆ భావాలసృష్టికి కారణభూతమైన భౌతిక పరిస్థితులనే విషయాన్ని కాదనడం లేదు. కాగా అట్టి భావాలు తిరిగి భౌతిక పరిస్థితులపై ప్రభావాన్ని కలిగిస్తాయి. వాటిని దృఢతరం చేయటానికి తోడ్పడతాయి. ఈ భౌతిక పరిస్థితులకు వ్యతిరేకంగా సమర్థవంతంగా పోరాటం జరగవలసి ఉంటుంది.'' నిజమే మరి. మనం ఈనాడు అటువంటి భావజాల వాతావరణం లోనే మనుగడ సాగిస్తున్నాం. తప్పని సరిగా రాజకీయార్థిక పోరాటాల్లో అంతర్భాగంగా భావవిప్లవ పోరాటాల్లో కూడా జరగాలి.

ప్రాచీన భారతీయ భౌతికవాదుల్లో లోకాయతులు (చార్వాకులు) అగ్రగణ్యులు. భారతీయ దార్శనిక వికాసంలో వీరికి సముచిత స్థానం వుంది. వైదిక వ్యవస్థ సమాజ జీవితాన్ని శాసిస్తూ, మూఢ విశ్వాసాలు పెంచిపోషిస్తున్న కాలంలో ''అగ్ని హోత్రం త్రయోవేదా త్రిదండం భస్మ గుంఠనం, బుద్ధి పౌరుష హీనానాం జీవికా ధాతృ నిర్మితా'' (అగ్నిహోత్రం, మూడు వేదములు, త్రిదండధారణం, భస్మావగుంఠనం ఈనాల్గు బ్రహ్మదేవుని చేత పుట్టింప బడిన బుద్ధిహీనులకు, పౌరుషహీనులకు జీవనాధారం) అంటూ దాని మీద తిరుగు బాటుగా చార్వాకులు సమాజ జీవితంలో అడుగుపెట్టారు. కేవలం మూఢ విశ్వాసాల ఖండనకే పరిమితం కాకుండా వైదికమత అనుచిత శాసనానికి వ్యతిరేకంగా వారు ఆనాడు చారిత్రాత్మకమైన పాత్రను నిర్వహించినట్లు చరిత్రను పరిశీలిస్తే తెలుస్తుంది. ఆనాటి సామాజిక పరిస్థితుల స్థాయిలో వారు నిర్వహించిన పాత్ర మరపురానిది. చార్వాకులు వాస్తవ జీవితంలో మిళితమై వాస్తవ పరిస్థితుల్ని అర్థంచేసుకొని తమ సిద్ధాంతాన్ని, దార్శనికవ్యవస్థను రూపొందించు కొన్నారని చటోపాధ్యాయ తమ పరిశోధన ద్వారా వెల్లడించారు. అంతే కాదు మేము చార్వాకుల వారసుల మని చెప్పుకునే నేటి భౌతిక వాదులకు, నాస్తికులకు, హేతువాదులకు సరియైన చారిత్రక దృష్టితో పాటు చార్వాకుల సమరశీల భౌతిక వాదం, సాంప్రదాయ కుల చేతిలో అది ఎదుర్కొన్న ఇబ్బందులను కళ్ళకు కట్టినట్టు చూపిస్తుంది. ఆయన ''లోకాయత'' గ్రంథం, మారిన చారిత్రక పరిస్థితులకు అనుగుణంగా తమ ఉద్యమాన్ని ఎలా రూపు దిద్దుకోవాలో తెలియచేస్తుంది. అందుకే ఆయన లోకాయతాన్ని ''ఫిలాసఫీ ఆఫ్ ది పీపుల్'' (ప్రజల తత్వశాస్త్రం) అంటారు. చార్వాక ఉద్యమానికి ఆనాటి సామాజిక పరిస్థితులకు వున్న సంబంధాన్ని శాస్త్రీయంగా విశ్లేషించి చూపడమే కాకుండ, భారతీయ దార్శనిక శాస్త్ర చరిత్రలో ఉన్న భౌతికవాద భావజాలాన్ని

వెలికి తీయడంలో ''లోకాయత'' గ్రంథకర్త కృతకృత్యుడయ్యారు. ఏ దేశచరిత్రలోనయినా ఒకే ఒక దార్శనిక దృక్పథం సర్వకాలాల్లోనూ చలామణి అవుతుందన్న అపోహ నుండి పాఠకులకు విముక్తి కలిగిస్తుంది ఈ గ్రంథం. భారతీయ తత్వశాస్త్రంలో వేదాంతమే ప్రధానమైన తాత్విక ఆలోచనా ప్రవంతి అనే భావాన్ని ప్రచారం చేసిన మాక్స్ ముల్లర్, రాధాకృష్ణన్‌లాంటి వారి అభిప్రాయాల్ని చరిత్ర పరిశోధన ద్వారా తప్పని ఈ గ్రంథంలో నిరూపించాడు. అంతేకాదు భారతీయ చరిత్ర ప్రారంభమైన నాటి నుంచి మతమే (ఆధ్యాత్మికతే) భారతీయుల జీవన విధానాన్ని, అభివృద్ధినీ నిర్ణయించిందన్న వాదాన్ని తమ పరిశోధన ద్వారా కాదని నిరూపించారు. మన సాంప్రదాయంలో ఆధ్యాత్మిక చింతనతో బాటు భౌతికవాద చింతన కూడ ప్రబలంగా ఉండేదని చూపించారు. అందువల్లనే అమెరికన్ మార్క్సిస్టు ఇండాలజిస్టు (భారత విషయ పరిశోధకుడు) డాల్‌రీపే భారతీయ దార్శనిక శాస్త్ర విషయాల్ని అర్థం చేసుకోవడానికి, అవగాహన చేసుకోవడానికి దేవీప్రసాద్ చటోపాధ్యాయ ''లోకాయత'' అవసరాన్ని గురించి ఇలా పేర్కొన్నారు: ''దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ లోకాయత గ్రంథంతో పరిచయం లేకుండా సాంప్రదాయక, ఆధునిక భారతీయ తత్వ శాస్త్రాలలోని భావాల్ని, వాదనల్ని మనం అర్థం చేసుకోలేము.''

''లోకాయత'' గ్రంథం ద్వారా కాలగర్భంలో కలిసిపోయిన ప్రాచీన భౌతికవాద భావజాలాన్ని వెలికి తీయడంలో చటోపాధ్యాయ సఫలీకృతుడైనా, అది మామూలు పాటక జనానికి అర్థమయ్యే శైలిలో రచింపబడలేదు. ''లోకేషు ఆయాతః లోకాయత'' అని జనాదరణ పొందిన తాత్విక సిద్ధాంతమైన లోకాయతాన్ని తొలిసారి వెలుగులోకి తెచ్చేటప్పుడు కేవలం సులభ పరిచయంగా గ్రంథాన్ని రచిస్తే దాన్ని పండితలోకం హర్షించదు. సాంప్రదాయక పండిత లోకం లోకాయత దర్శనంపైన దాని దార్శనికులపైన కక్ష గట్టి ఎన్నో అపవాదుల్ని, అపోహల్ని తమ రచనల్లో ప్రచారంచేశారు. మాధవాచార్యుడి ''సర్వదర్శన సంగ్రహం'' గ్రంథం నుండి రాధాకృష్ణ పండితుడి ''భారతీయ తత్వశాస్త్రం'' వరకు లోకాయతులపై ఎన్నో తప్పుడు భావాల్ని ప్రచారం చేశాయి. ఆ ప్రచార ప్రభావంలో విద్యావంతులు వున్నారు. అటువంటి పరిస్థితిలో ఆ ఉద్దండ పండితుల రాతల్ని ఎదుర్కోవాలంటే పాండిత్య ప్రకర్షణా పద్ధతి అవలంబించక తప్పదు. అయితే ఏ ప్రజల్ని ఉద్దేశించి ఆ గ్రంథరచన జరిగిందో, ఆ ప్రజలకే గ్రంథంలోని విషయం అవగతం కాకపోతే ఆపరిశోధన వల్ల, ఆ గ్రంథ రచనవల్ల ప్రయోజనం లేనట్లే. అందుచేతనే చటోపాధ్యాయ లోకాయతాన్ని ప్రజల పరిభాషకు దగ్గరగా తేవడం కోసమని 1988 సంవత్సరంలో ''ఇన్ డిఫెన్స్ ఆఫ్ ఏన్‌షెంట్ ఇండియన్ మెటీరియలిజమ్'' (ప్రాచీన భారతీయ భౌతిక వాద సమర్థన) పేరుతో మరోసారి లోకాయత వాద పరిశీలన చేసి, అది ప్రజలకు సులభంగా అర్థమయ్యేరీతిలో సులభ పరిచయంగా రచించారు. భారతీయ తత్వ శాస్త్రంపై, మరీ ముఖ్యంగా ప్రాచీన భారతీయ భౌతికవాదంపై, తన సుదీర్ఘమైన పరిశోధనా ఫలితాలను కేవలం పాండిత్య ప్రదర్శన కోసమో, ఆత్మ సంతృప్తి కోసమో కాకుండా అవి ప్రజల్ని ప్రభావితం చేయాలన్న సంకల్పంతో మరోసారి లోకాయత వాద పరిశీలన చేశారు చటోపాధ్యాయ. ప్రాచీన భారతంలో వైజ్ఞానిక ప్రగతికి మతవాదులు, భావవాదులు ఎలా ఆటంకంగా, అడ్డంకిగా తయారయిందీ, అదే సమయంలో అవైదిక దర్శనాల్లో అద్వితీయ దర్శనమైన లోకాయత భౌతిక వాదం వైజ్ఞానిక ప్రగతికి ఎలా దోహద పడిందీ చక్కగా వివరించారు. ''సమస్త విలువల్ని చార్వాకులు పరిత్యజించారు. శివం, ఉత్తమం, పవిత్రం, కరుణామయమైన దంతా చార్వాకులకు సందేహాస్పదమైంది. సుఖవాదమే లోకాయతుల నైతికాదర్శంగా రాధాకృష్ణన్ లాంటి పండితులే వ్యాఖ్యానిస్తే దానికి చటోపాధ్యాయ ''మహాభారతంలోని చార్వాక రాక్షసుడి'' ఉదంతాన్ని పేర్కొని, ఆ కథలోని నైతిక దృక్పథాన్ని గురించి పునరాలోచించవలసిన అవసరాన్ని ప్రస్తావించారు. మహాభారత యుద్ధంలో తన బంధుమిత్రులను, వృద్ధులను హత మార్చినందుకు ధర్మరాజుని తీవ్రంగా అభిశంసించడంలో చార్వాకుడు ధైర్యం ప్రదర్శించాడే కాని ''రేపు వుంటామో లేదో నేడే

అనుభవించు'' అని బోధించే సుఖవాదానికి ఇందులో తావేలేదంటూ, ''సుఖాల వెంట పరిగెత్తు'' అనే నీతి చార్వాక వృత్తాంతంలో గాక మహా భారతంలో యుద్ధానికి సంబంధించిన ఇతర గాథల్లో వుందని పేర్కొంటాడు. పాండవుల్లో యోధుడైన అర్జునుడు యుద్ధం చేయడానికి వెనుకంజ వేస్తాడు. ఈ నేపథ్యంలో శ్రీకృష్ణుడు ప్రవేశించి అర్జునుడ్ని యుద్ధోన్ముఖుడ్ని చేస్తూ చేసిన వాదనలో ఇలా అంటాడు: ''యుద్ధంలో మరణిస్తే స్వర్గ సౌఖ్యాలు అనుభవిస్తావు; జయిస్తే రాజ్యం అనుభవిస్తావు.'' యుద్ధంలో విజయం పొందినా, మరణించినా సౌఖ్యమే అనుభవిస్తావు అని కృష్ణుడే స్వయంగా చెబితే దీనిలో సుఖవాదం (Hedonism) మన పండితులకు, ఆధ్యాత్మిక సంపన్నులకు కనిపించలేదు. కాని మానవ విలువల కోసం ప్రాణాన్ని సయితం లెక్కచేయకుండా అంతమందిలో ధర్మరాజుని ప్రశ్నించిన చార్వాకుడి దర్శనంలో రాధాకృష్ణ పండితుడికి సుఖవాదమే నైతికాదర్శంగా కనిపిస్తుంది. ఇది మన పండితుల పాండిత్యం, నిష్పాక్షిక పరిశీలనం! ఇటువంటి ఉదంతాలతో ప్రజలకు సులభంగా అర్థమయ్యేట్టు లోకాయత దర్శన విశ్వరూప దర్శనాన్ని అందించారు చటోపాధ్యాయ.

''చార్వాకులను సమర్థించడం వారి భావాలను సమర్థించడమే. అట్టి సమర్థన పట్ల సనాతన వర్గాల్లో తీవ్ర నిరసన తప్పదు. సత్యశోధనమే తత్వ శాస్త్రానికి ప్రయోజనం; అయినప్పుడు తత్వశాస్త్రానికి రాజకీయ ప్రయోజనం వున్నదని చర్చించడం సబబుగా వుండక పోవచ్చు. అయినా తత్వం వెనుక నున్న రాజకీయ ప్రయోజనాన్ని గురించి ఆలోచించడం అవసరం.'' (దేవిప్రసాద్ చటోపాధ్యాయ, లోకాయతవాద పరిశీలన, అనువాదం: జి.ఎస్.ఎల్. హనుమంతరావు, 1989, పే. 98). ఈ వ్యాఖ్య ద్వారా చటోపాధ్యాయ మొత్తం భారతీయ ఆధ్యాత్మిక చింతనపై, ముఖ్యంగా భగవద్గీతలోని తాత్విక ధోరణిపై - మార్మిక కవిగా, విశ్వ కవిగా ప్రసిద్ధి చెందిన టాగూర్ నిశితమయిన విమర్శని పాఠకుల దృష్టికి తెచ్చారు. టాగూర్‌ని భారతీయ ఆధ్యాత్మిక చింతనకు, ఉపనిషత్ భావజాలానికి నిజమైన వారసుడిగా ప్రచారం చేస్తుంటారు. కాని భారతీయ తాత్విక వారసత్వంలో అద్భుత ఆధ్యాత్మిక గ్రంథంగా పేర్కొన బడుతున్న ''భగవద్గీత''లోని దార్శనికతను గురించి టాగూరు చేసిన 1932 నాటి తీవ్రమైన విమర్శని చటోపాధ్యాయ ఈ రచనలో మన దృష్టికి తెచ్చారు. గీతలోని వాక్యంగా పరిగణించ బడుతున్న కఠోపనిషత్తులోని ''నహన్యతే హన్యమానే శరీరే'' (శరీరానికి నాశనం వుంది కాని ఆత్మకు లేదు) అనే సంస్కృత వాక్యంపై మహాకవి టాగూరు తీవ్రమైన విమర్శ చేశాడు. ''శరీరం నశించినా ఆత్మ నశించదు'' అనే వాక్యంలో జనన మరణాలతో ఆత్మకు సంబంధం లేదని చెప్పడం జరిగింది. ఈ వాక్యంలోని మాటల అందాన్ని, తాత్విక గాఢతను గురించి ఠాగూర్ ఆలోచించలేదు. ఈ మాటలలోని వికృత స్వభావం ఠాగూర్‌ని ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. సున్నితమైన ఆయన హృదయాన్ని కదిలించి వేసింది. అందువల్లనే ''గీతా తత్వం'' గురించి ఠాగూర్ ఇలా విశ్లేషించాడు: ''గీతబోధించిన తత్వం కూడ ఒక రకంగా విమానయానం వంటిదే. అర్జునుడిలోని జీవకారుణ్యాన్ని కృష్ణుడు మహోన్నత శిఖరాలకు తీసుకుపోయినాడు. అటనుండి క్రిందకు చూచినప్పుడు హతుడు, హంతకుడు, బంధువు, శత్రువు అనే వ్యత్యాసాలు నశిస్తాయి. మానవుని ఆయుధాగారంలో ఇటువంటి తాత్విక పదార్థంతో తయారైన ఆయుధాలు చాలా వున్నాయి. వాస్తవాన్ని కప్పి పుచ్చడానికి ఇవి చక్కగా వుపకరిస్తాయి. మతంలో, సామాజిక శాస్త్రంలో, సామ్రాజ్య వాదసిద్ధాంతంలో ఇటువంటివి కోకొల్లలు. సిద్ధాంతం ప్రకారం హతునికి ఒకే ఒక మనశ్శాంతి. ''నహన్యతే హన్యమానే శరీరే - శరీరానికి నాశనం వుంది గాని ఆత్మకు లేదు.'' (పే. 100) 1932 సంవత్సరంలోనే ఠాగూర్ కొన్ని దార్శనిక విషయాల్లో సామాజికంగా చెడుఫలితాల నిచ్చే అంశాలను గుర్తించాడు. కేవలం గుర్తించడమే కాదు వాటిలోని అమానుషత్వాన్ని ప్రతిభావంతంగా వెలుగులోకి తెచ్చాడు. ఆధ్యాత్మిక ఔన్నత్యం పేరుతో మానవత్వాన్ని మంటగలిపే ఇటువంటి దార్శనిక వారసత్వాన్ని గురించి టాగూర్ చేసిన నిశితమైన విమర్శలో ''మరల మరల ఆలోచించవలసిన విషయాలు చాలా వున్నాయి'' అంటారు చటోపాధ్యాయ. ఒక విప్లవకారుడో, నాస్తికుడో చేయాల్సిన

విమర్శని జీవితాంతం దాక ఉపనిషత్తత్త్వానికి అంకితుడైన టాగోర్ డెబ్బయి ఏళ్ళ వయస్సులో, మరణానికి అతి చేరువులోవున్న సమయంలో చేసిన ఆ విమర్శకు ఎంతో ప్రాధాన్యము వుందంటాడు చటోపాధ్యాయ లోకాయత వాద పరిశీలనలో.

ఈ గ్రంథం తర్వాత చటోపాధ్యాయ రచనల్లో పేర్కొనాల్సిన మరో గ్రంథం ''భారతీయ తత్వ శాస్త్రంలో సజీవమూ, నిర్జీవమూ'' (What is living and what is dead in Indian Philosophy) వుంది. దీనిలో మొత్తం భారతీయ వైదిక, అవైదిక దార్శనిక శాఖలను నొక్కి చెబుతూ, నిర్జీవధోరణు లలో భాగమైన 'వేదాంతం' 'మహాయాన బౌద్ధం' వంటి దర్శనాల్ని విమర్శనాత్మకంగా విసర్జించమని చెప్పాడు. భారతీయ భావవాద మూలాల్ని, దాని సాంఘిక ప్రయోజనాల్ని వివరిస్తూ, ప్రగతి నిరోధకమైన భావవాద వారసత్వాన్ని నిరాకరించమని స్పష్టంగా చెప్పాడు. దీనిలో చటోపాధ్యాయ ఒక ముఖ్యమైన విషయాన్ని మన దృష్టికి తెచ్చాడు. మహాయాన బౌద్ధులకు, అద్వైత వేదాంతులకు మతరీత్యా వైషమ్యమే కాని తాత్వికంగా వైరుధ్యంలేదని, ఇద్దరూ ఒకే భావవాద దృక్పథాన్ని స్వీకరించి, వేరు వేరు మార్గాలలో అభివృద్ధి చేశారని నిరూపించాడు. అందువల్ల మహాయాన బౌద్ధం బుద్ధుడి దార్శనిక వారసత్వం నుండి దారి తప్పిందనీ చివరికి భారతీయ భావవాద సాంప్రదాయంలో అంతర్భాగమయిందని పేర్కొంటాడు. తొలి బౌద్ధంలోని గతి తార్కిక చింతన మహాయాన బౌద్ధంలో అంతరించిందని వీరు వేసిన ప్రతి అడుగు సైద్ధాంతిక తిరోగమనాన్ని సూచిస్తుందంటాడు. అందువల్ల తీవ్ర భావవాద దార్శనికులైన నాగార్జునుడు, శంకరుడు మన తత్వవేత్తలలో అగ్రగణ్యులని చెప్పుకోవటం ఆత్మవంచన అని హెచ్చరించాడు. మనకు సమస్యలు ఎన్నో ఉన్నాయి. వాటికి పునాది భౌతిక జీవితంలోనే వుంది. అటువంటి భౌతిక జీవిత వాస్తవాన్ని నిరాకరించే పలాయన వాద దార్శనిక వ్యవస్థలకు ప్రతినిధులైన నాగార్జునుని, శంకరుడ్ని మహోన్నత దార్శనికులుగా పరిగణించటం పొరపాటని చటోపాధ్యాయ అభిప్రాయ పడ్డాడు. ఈ భావవాద దార్శనికులకు వ్యతిరేకంగా భౌతికవాద దార్శనికులు తమ నిరసనను తెలియచేశారని చెబుతూ, మన సాంప్రదాయక భావాలలో వైజ్ఞానిక ప్రగతికి దోహదపడే వాటిని పరి రక్షించుకోవాలి, తద్విరుద్ధమైన వాటిని పరిత్యజించాలని స్పష్టం చేశాడు.

''భారతీయ నాస్తికత్వం - మార్క్సిస్టు విశ్లేషణ'' (Indian Atheism - A Marxist Analysis) 1969లో రచించారు. గ్రంథ ప్రారంభంలో చటోపాధ్యాయ ఇలా అంటాడు: ''ఈరోజు సోషలిజం కోసం జరిగే పోరాటంలో భాగంగానే భారతీయ తాత్విక వారసత్వం కొరకై జరిగే పోరాటం కూడా సంబంధం కలిగివుంది. వస్తుగత దృక్పథంతో వాస్తవమైన తాత్విక విషయాల్ని విశ్లేషించి, అదే సమయంలో సజీవ ధోరణుల్ని కాపాడుకోవటం, నిర్జీవ ధోరణుల్ని వదిలేయటం చేసినప్పుడే మన నిజమైన తాత్విక వారసత్వాన్ని నిలుపుకోగలం.'' ఇదే వుద్దేశంతో చటోపాధ్యాయ ఈ గ్రంథరచన చేసినట్లు ''భారతీయ నాస్తికత్వం'' చదివితే అర్థమౌతుంది. అంతే కాదు. మార్క్సిజం తీవ్రమైన నాస్తికత్వాన్ని ప్రబోధిస్తుంది. కనక అది మన జాతీయ వారసత్వాన్ని (ఆధ్యాత్మికతను) నాశనం చేస్తుందన్న అభిప్రాయం విస్తృతంగా ప్రచారంలో వుంది. ఆపొరపాటు అభిప్రాయాన్ని సరిదిద్దటం కోసం, దానితో పాటు భారతదేశంలోని ప్రధాన తాత్విక ధోరణులన్నీ నాస్తికత్వాన్ని ప్రబోధిస్తున్నా యని శాస్త్రీయంగా నిరూపించటం కోసం ఈ గ్రంథ రచన జరిగింది. కేవలం మార్క్సిజం దైవాన్ని అంగీకరించదన్న విషయాన్ని ఆధారం చేసుకొనే ఈ ప్రచారకులు మార్క్సిజాన్ని తిరస్కరిస్తే, అసలు భారతీయ తత్వవేత్తల మూల గ్రంథాల్ని కనక వీరు పరిశీలిస్తే భారతీయ దార్శనిక చింతకులందరిని దాదాపు తిరస్కరించాల్సి వుంటుంది. అలా చేయగలరా? అని ప్రశ్నించాడు చటోపాధ్యాయ. బౌద్ధం, జైనం, పూర్వ మీమాంస, సాంఖ్య, లోకాయత, న్యాయి, వైశేషిక దర్శనాలు వాటి నిజరూపంలో నాస్తిక దర్శనాలేనని, ఒక్క వేదాంత దర్శనమే ఆస్తిక దర్శనంగా పేర్కొన వచ్చని చటోపాధ్యాయ అభిప్రాయ పడ్డాడు.

ఈ గ్రంథంలో మరొక ముఖ్య విషయాన్ని కూడా చటోపాధ్యాయ మన దృష్టికి తెచ్చాడు. ఇన్ని దర్శనాలు దైవాన్ని నిరాకరించేవి భారతదేశంలో వున్నా ఈనాటి వరకు ప్రజల మనస్సులో దైవమనే మూఢభావం ఎలా చోటు చేసుకొని వుందని ప్రశ్నించాడు. మన దార్శనికులు దైవాన్ని భ్రమ అనీ, మూఢ విశ్వాసమని ఖండించారేకాని దాని భౌతిక పునాదిని చారిత్రకంగా అర్థం చేసుకోలేక, తార్కికంగా వాదించి రూపు మాపడానికి ప్రయత్నించలేదు. ఇదే భారతనాస్తికుల్లో వున్న ప్రధాన బలహీనత అని వివరించాడు. ఈ బలహీనతను దాటి ముందుకు పోవాలని, సరియైన శాస్త్రీయ విధానం ద్వారా దైవ భావ నిర్మూలనకు కృషి చేయాలని సూచించాడు. తరతరాలుగా వస్తున్న ఈ మూఢ విశ్వాసాన్ని మార్క్స్ భౌతికవాదం ద్వారా మాత్రమే జయించగలమని ఆయన అభిప్రాయ పడ్డాడు.

1977 సంవత్సరంలో చటోపాధ్యాయ మరొక ఆసక్తికరమైన పరిశోధనా గ్రంథం ''సైన్స్ అండ్ సొసైటీ ఇన్ ఏన్షెంట్ ఇండియా'' (ప్రాచీన భారతదేశంలో విజ్ఞాన శాస్త్రం సమాజం) రచించారు. ఇందులో ప్రాచీన భారతదేశంలో అధికంగా అభివృద్ధి చెందిన విజ్ఞాన శాస్త్రం - ఆయుర్వేదం (వైద్య శాస్త్రం) గురించి లోతైన చర్చ చేశాడు. ఆయుర్వేదం అనగానే నేటి వైద్య శాస్త్ర విద్యార్థులకు కాలం చెల్లిన వైద్య విధానంగా, అశాస్త్రీయ మంత్ర తంత్రాలు, వన మూలికలతో కూడిన కలగూర గంపగా గోచరించవచ్చు. నిజానికి ఆయుర్వేదం (''ఆయుర్దాయాభివృద్ధిని గురించి తెలుపుతుంది కాబట్టి ఈ శాస్త్రాన్ని ఆయుర్వేదం అన్నారు.'') ప్రాచీన భారతదేశంలోనే కాదు ప్రపంచంలోనే అద్భుతమైన శాస్త్రీయ వైద్య విధానంగా పరిగణించ వచ్చని ఈ గ్రంథాన్ని చదివిన పాఠకులు గ్రహించ గలరు. ప్రాచీన భారత దేశంలో అధ్యయనం చేయబడిన విద్యలన్నింటిలోకి ప్రకృతిని ఆకళింపు చేసుకొని, అవగాహన చేసుకొని లౌకిక దృక్పథం ఏర్పరచుకున్న శాస్త్రాలలో ఆయుర్వేదమే ప్రథమ శాస్త్రమని, దాని అభివృద్ధికి దోహదం చేసిన వారు ప్రపంచాన్ని మాయగా, మిథ్యగా పరిగణించిన వేదాంతులు కారని ప్రపంచ వాస్తవికతను, దాని భౌతికతను అంగీకరించిన ప్రాచీన భౌతిక వాదులేనని ఆయన దీనిలో నిరూపించారు. ప్రాచీన భారత దేశంలో రూపొందింప బడిన విజ్ఞానానికి, తద్భిన్నమైన భావవాదానికీ, మతవాదానికీ మధ్య జరిగిన సైద్ధాంతిక పోరాటాన్ని శాస్త్రీయంగా విశ్లేషించి చూపాడు చటోపాధ్యాయ. ధర్మ శాస్త్రకారులు, భాష్యకారులు వైద్యశాస్త్రాన్ని, వైద్య వృత్తిని, వైద్యుని తక్కువ చూపుతో చూశారని నిరూపించాడు. ఆపస్తంబుడు, గౌతముడు, కుల్లూక భట్టు (మనధర్మశాస్త్ర భాష్యకారుడు) లాంటివారు వైద్య వృత్తిని తక్కువ కులాల్లో జన్మించిన వారికే పరిమితమై వుండాలని శాసించారు. ఇటువంటి అశాస్త్రీయ భావాల్ని ప్రాచీన భౌతిక వాదులు, గౌతమ బుద్ధుడి వంటి లౌకికవాద దార్శనికులు తీవ్రంగా ఖండించారు. బుద్ధుడి ప్రభావం వలన బౌద్ధ సంఘ ఆరామాల్లో వైద్య శాస్త్రం బాగా అభివృద్ధి చెందింది. జీవకుడు లాంటి ప్రసిద్ధి చెందిన ఆయుర్వేద వైద్యులు ఆకాలంలో వుండేవారు. జీవకుడు బుద్ధుడి సమకాలికుడు. చటోపాధ్యాయ పేర్కొన్నట్టు చరకుడు (అది వ్యక్తి నామమయితే!), అగ్నివేశుడు, దృఢ బలుడు, సుశ్రుతుడు మున్నగు శాస్త్రజ్ఞులు భౌతికవాదంలో విశ్వాసం వున్నవారే! కాని తమ విశ్వాసాల్ని వారు బాహాటంగా ప్రదర్శించకుండా, వేదాంతులకు, ధర్మశాస్త్ర కారులకు గౌరవం చూపిస్తున్నట్టు నటించారు. అలా నటించక పోతే వారిని వైదిక సమాజం, ధర్మ సూత్రకారులు సంఘ బహిష్కృతులను చేసేవారు. ధర్మశాస్త్ర కారులకు భయపడి వారు బహిరంగంగా తమ భావాల్ని బయట పెట్టకుండా ఆయుర్వేద విజ్ఞానం అభివృద్ధికి కృషి చేశారు. పరస్పర విరుద్ధంగా కనిపించే విషయాలు మనకు మన ప్రాచీన వైద్యశాస్త్ర గ్రంథాలలో అనేకం కనిపిస్తాయి. వాటిలో ముఖ్యమైనది గోవుని గురించిన వారి భావాలు. కొన్ని సందర్భాలలో గోమాంస భక్షణాని 'చరక సంహిత' నిర్దేశిస్తుంది - ''గవ్యం కేవల వాతేషుపీనసే విషమజ్వరే, శుక కాశ శ్రమ అత్యాగ్ని మాంసక క్షయ హితంచ తత్'' (శారీరకమైన కృషి చేసేవారికి, అధికమైన ఆకలి గొన్న వారికి, బలహీనులకు, శరీరంలో మాంసం

లేని వారికి, చిక్కి శల్యమైన వారికి గోమాంసం పెట్టినట్లయితే వారికి పుష్టి కలిగి వారి శరీరంలో మాంసాభివృద్ధి అవుతుంది). అదే సమయంలో గోవులను, బ్రాహ్మణులను, గురువులను, వృద్ధులను, సిద్ధులను, ఆచార్యులను పూజించ వలసిందని చరక సంహిత ఇలా అంటుంది ''దేవ గో బ్రాహ్మణ గురు వృద్ధ సిద్ధాచార్యాన్ అర్చయేత్''. వైద్యశాస్త్ర రీత్యా గోమాంస భక్షణను ప్రోత్సహిస్తూ, అదే సమయంలో పురోహిత వర్గానికి భయపడి గోపూజను ప్రస్తావించడం పరస్పర విరుద్ధంగా వుంటుంది. ఇది కేవలం భారతదేశానికే పరిమితమైన విషయం కాదు. ఇటువంటి పరస్పర విరుద్ధమైన అభిప్రాయాల్ని ప్రాశ్చాత్య దేశాల్లోని శాస్త్రజ్ఞులు సయితం వెల్లడించక తప్ప లేదు. పురోహిత వర్గం అది ప్రాచ్యమైనా, పాశ్చాత్యమైనా ఒక్కటే (పాశ్చాత్య దేశాల్లో విజ్ఞాన శాస్త్రజ్ఞుల్ని అక్కడి పురోహిత వర్గం ఎన్ని కష్టాలకు గురి చేసిందో తెలుసు కోవాలంటే నార్ల వారి 'జాబిలి' ద్వితీయ ముద్రణకు పీఠికను చూడండి). గోమాంస భక్షణను గురించి 'చరక సంహిత' ఎలా పరస్పర విరుద్ధ అభిప్రాయాలు వ్యక్తీకరించిందో, అదే విధంగా మద్యపానాన్ని గురించి కూడా వెల్లడించింది. విజ్ఞాన శాస్త్రం చర్చించినట్లు మద్యపానం వలన కలిగే లాభ నష్టాలను గురించి చరక సంహిత శాస్త్రీయంగా చర్చించింది. అతిగా త్రాగడం వల్ల కలిగే చెడు లక్షణాల్ని వివరిస్తూ, మద్యపానం అసలు పనికిరాదనే వారివాదనను, దాని నిషేధించాలనే వారి అభిప్రాయాల్ని చరకం నిరాకరిస్తుంది. మద్యం స్వభావాన్ని చరక సంహిత ఇలా వివరిస్తుంది ''కింతు మద్యం స్వభావేన యథైవాన్నం తథాస్మృతం, అయుక్తి యుక్తథాం రోగాయ యుక్తి యుక్తం యథామృతం''(చరక సంహిత II.24.59). అతి తిండి ఎంత ప్రమాదకరమో, అదే విధంగా విచక్షణ రహితంగా మద్యం సేవించటం కూడా ప్రమాదకరమని, వివేచనతో కనుక దాన్ని సేవించి నట్లయితే అది అమృత తుల్యమని ఆయుర్వేదం పేర్కొంటుంది. ఇది ఎంతో గొప్ప శాస్త్రీయ ధోరణి. ఇటువంటి ధోరణి వ్యక్తీకరించిన వారు భౌతిక వాదులవుతారు కాని మత వాదులో, పురోహిత వర్గ ప్రతినిధులో కాలేరు. పరస్పర విరుద్ధ భావాలనుండే ప్రాచీన కాలంలో వైద్యశాస్త్రం భౌతిక వాద సూత్రాల కనుగుణంగా ఎలా అభివృద్ధి చెందిందో చటోపాధ్యాయ ప్రతిభావంతంగా గ్రంథంలో నిరూపించాడు. ప్రముఖ మానవ వాద రచయిత నార్ల వెంకటేశ్వరరావు అన్నట్లు ''ఏమైనా ఇక్కడ ముఖ్యమైన విషయం. ఒక్కటి మాత్రమే. వేద పండితులకు భయపడి, పురోహిత వర్గానికి భయపడి ఆయుర్వేద శాస్త్రజ్ఞులు ఎంతో నటన చేశారు. ఏవేవో నాటకాలు ఆడారు. దేవీప్రసాద్ పుస్తకం ఈ విషయాన్ని తిరుగులేని తార్కాణాలతో నిరూపిస్తుంది.''

ఈ విధంగా భారతీయ తత్వశాస్త్ర చరిత్రలోని భౌతికవాద తాత్విక వారసత్వాన్ని వెలికి తీయడంలో దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ రచనలు ఎంతో దోహద పడ్డాయి. నేడు మనం చాలా ప్రమాదకర పరిస్థితుల్లో మనుగడ సాగిస్తున్నాం. దేశంలో మతవాదం విజృంభిస్తోంది. మతవాద దృక్పథంతో మన సంస్కృతిని వ్యాఖ్యానిస్తున్న విపరీత ధోరణులు నేడు రాజ్యమేలు తున్నాయి. ఈ పరిస్థితిలో చటోపాధ్యాయ మనమధ్య లేకపోవడం తీరని లోటు. ఆయన మన మధ్య భౌతికంగా లేకపోయినా, ఆయన ఆవిష్కరించిన ప్రాచీన భౌతికవాద, వైజ్ఞానిక వారసత్వం, సంపద మన మధ్య వుంది. దాని ప్రేరణతో మానవత్వాన్ని మంట గలుపుతున్న మతవాద వారసత్వానికి వ్యతిరేకంగా సైద్ధాంతిక పోరాటం కొనసాగిద్దాం. ఇదే ఆయనకు మనం అర్పించే నివాళి. ★

## The deification of a bull

In a strange inversion of Spain's favourite sport, it's the Bull that pays the piper here, while we poor picadors and matadors dance to his tune

**"He has the power of a godman And there probably are some people who regard him as a reincarnation of God. After centuries of sacred cows, we now have a sacred bull... It is easier to believe one crook than to accept the fact that the country is run by hundreds of crooks."**

**- K.K. Pillai**

# పోలీసు ప్రస్థానం
## సింహావలోకనం

**డా॥ సూరత్తు వేణుగోపాలరావు**

పూర్వానుభవాలు వ్రాసుకొనే వారందరికీ తమ రచనని ఎప్పుడు ఆపాలన్న ఇంగిత జ్ఞానం ఉండాలి. డేవిడ్ నెవిన్ అనే ప్రఖ్యాత కళాకారుడు తన స్వానుభవాన్ని వ్రాస్తూ ఈ సమస్యనెలా పరిష్కరించుకోవాలన్న మీమాంసలో పడ్డాడు. ఒక స్నేహితుడ్ని సంప్రదిస్తే ఆయన నిర్మొహమాటంగా, ''నువ్వు చెప్పేదేమీ లేకపోతే ఇక చాలించు'' అన్నాడట. నేను కూడా ఇప్పుడు ఆ స్థితికి వచ్చాను. నా స్నేహితుడు పురుషోత్తమన్ సలహా కోరితే, ఆయన సూక్ష్మంగా సింహావలోకనతో సమాప్తం చేస్తే బాగుంటుందన్న అభిప్రాయం వ్యక్తపరిచాడు. అలా సింహావలోకనం చెయ్యడానికి నేను సోమర్‌సెట్‌మామ్ అంతటివాడినా?

అయితే నా స్నేహితుడి సూచనలో కొంత విజ్ఞత లేకపోలేదు. ఏ వ్యక్తి ఏకాకి కాడు. అతడిని అంటిపెట్టుకొని ఎన్నో ప్రేమలు, భ్రమలు, వైరుధ్యాలు ఉంటాయి. పుత్రుడిగా, తండ్రిగా, భర్తగా, స్నేహితుడిగా సాధారణ పౌరుడిగా ఎన్నో జీవితాలు జీవిస్తాడు. జీవితం, ''వివిధ వర్ణాల అద్దాల మేడ'' అనీ, ''అది చిత్రవిచిత్రంగా మెరుస్తూ ఉంటుందని'' ఒక మహాకవి అన్నాడు. నిజమే! జీవితంలో సంతోషం, దుఃఖం, జయం, అపజయం, దీక్ష, ప్రమత్తత, వినోదం, విజ్ఞానం, మంచి, చెడూ ఉంటాయి. ఈ రచనలో నేను తక్కిన విషయాలు వెనుకకు నెట్టివేసి నా వృత్తినిర్వహణ, శాస్త్రసాహిత్య ప్రయత్నాలని గురించే వ్రాశాను. ఒక వ్యక్తికి జీవితంమీద ఆసక్తిపోయి, 'నభవిష్యత్తు' అన్నప్పుడే ఆత్మకథ వ్రాసుకుంటాడని ప్రఖ్యాత రచయిత ఎలివన్ వాగ్ ఉటంకించాడు. ఆ అభిప్రాయంతో నేను ఏకీభవించను. వృద్ధాప్యంలో కూడా నా ఉత్సుకత పోలేదు. దేశ భవిష్యత్తు ఏమిటి అన్న బాధాపూర్వకమైన ఆందోళన మనస్సుని వికలం చేస్తోంది.

మారిపోతున్న పోలీసు వ్యవస్థ, రేపు అది ఎదుర్కొనే సవాళ్లను గురించి ప్రస్తావించడమే నా రచన ముఖ్యోద్దేశం. నా వ్యక్తిగత జీవిత విషయాలు - అంటే నా ఆశలు, ఆశయాలు, భయాందోళనలు, కోపతాపాలు వర్ణించలేదు. ఇవన్నీ ప్రతి మానవ జీవితానికి సహజం. నాకంటె ఎన్నోవిధాల మహాజ్ఞానులు, వేదాంతులు, పండితులు ఆ విషయాలమీద వివిధ పథాల్లో విజ్ఞాన పూర్వకంగా తర్కించారు. అలా తర్కించగల జ్ఞానం, శక్తి నాకులేవు. స్వానుభవంవల్ల కొన్ని భావాలకి మాత్రం అక్షరరూపం ఇచ్చాను.



జీవిత పర్యంతం 'పోలీసువాడు' అని చులకనగా చూస్తారన్న భావం నీడలా నన్ను వెంటాడుతూనే ఉంది. సామాజిక పరంగా ఒక ఉత్కృష్టమైన వృత్తిని స్వీకరించాననీ, అందుకు గర్వపడుతున్నాననీ చెప్పటానికి ఆస్కారం సాధారణంగా కనపడలేదు. ఈ మాట నాసహాధ్యాయులకి, పోలీసు బలగాని కంతటికీ కూడా కంటకప్రాయంగా, వెగటుగా ఉండవచ్చు. నన్నింత చేసి అపూర్వమైన గౌరవాభిమానాలు చూపించిన సంస్థనే చిన్నచూపు చూసినట్లు అనిపించవచ్చు. వాస్తవికంగా సమాజం పోలీసు అధికారి సేవలు కోరుతుంది. కాని అతడి

వ్యక్తిత్వానికి సరైన స్థానం ఇవ్వడానికి అంగీకరించదు. ఈ సాంఘిక నిర్లిప్తత అనివార్యం కాబోలు!

ఈ మధ్యనే ఉదయ వాహ్యాళిలో ఒక సుప్రసిద్ధ నటుడు తటస్థపడ్డాడు. జాతీయంగా, అంతర్జాతీయంగా చాలా సన్మానాలు పొందాడు. మా సంభాషణలో పోలీసు వెంకటస్వామి కథల సంగతి యాదృచ్ఛికంగా వస్తే, నేను ఆ ప్రచురణని దేశ సేవలో ప్రాణత్యాగం చేసిన పోలీసు జవాన్లకీ, అధికారులకీ అంకితం చేశాననీ, దానిమీద లాభాలు పోలీసు సంక్షేమ నిధికి విరాళంగా ఇచ్చానని చెప్పాను. అప్పుడాయన అన్నమాటవింటే చదువరులు బిత్తరపోక మానరు. ''పోలీసు - కొడుకుల కోసం మీకెందుకీ తాపత్రయం''? అని నలుగురి ముందూ నవ్వాడు. ఆ వెగటు మాటలు క్షంతవ్యం కావు. అవమానం భరించలేక కోపంగా ''నేను కూడా మీ నటశేఖరులని మరింత అసభ్యమైన భాషలో తిట్టగలను కాని సంస్కృతి, సభ్యత నాలో ఉంది'' అని అందరిలోను దులిపేశాను. తక్షణమే జ్ఞానోదయం కలిగి ''జారిన మాటకు'' క్షమాపణలు చెబుతూ, ఆ నటనాగ్రేసరుడు, ''క్షమించండి. ఆమాట తమర్ని ఉద్దేశించింది కాదు'' అన్నాడు. అసలు సంగతి అక్కడే వుంది. ఆయన స్పందన సాధారణ ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబిస్తోంది. తెలిసో తెలియకో ఆయన ''వ్యవస్థనే'' తృణీకార భావంతో చూస్తున్నాడు. ఇది బాధాకరమైన విషయం.

పోలీసు అధికారి తన కార్యాచరణ మీద కాకుండా సంస్థారూపకంగానే చిత్రీకరింపబడుతు న్నాడు. ఈ సందర్భంలో నా స్నేహితుడు మహారాష్ట్ర డి.జి.పి. మేడేకర్ ఒక దృష్టాంతం వివరించాడు. ప్రధాన మంత్రి శ్రీమతి గాంధి బొంబాయి వచ్చినప్పుడు మాటలలో, ''నీ పిల్లలు ఏం చేస్తున్నారని'' అడిగింది. సమాధానంగా ఒకడు ఇండియన్ పోలీసు సర్వీసులో చేరాడని చెప్పాడు. ఆమె నవ్వుతూ, ''మీరు గూడా పిల్లల్ని ఆ 'సర్వీసు' లోనే చేర్పించారా'' అని చులకనగా అన్నదట. ఒక మహావ్యక్తి - అందులోనూ దేశ ప్రధాని - పోలీసుల మీద తృణీకారభావం చూపించిందంటే సాధారణ ప్రజలకి సద్భావం ఎలా కలుగుతుంది? రాజకీయ నేతలు తమ సంతానాన్ని రక్షణ విభాగంలోకి కాని, పోలీసు శాఖలో గాని సాధారణంగా చేరనీయరు. వాళ్ల సంతానాన్ని తమ అడుగుజాడలలో నడవాలనో, అధికారం ప్రాపకంలో పారిశ్రామిక వేత్తలు కావాలనో అభిలషిస్తారు. ఈ భావంవల్ల సమాజానికి మేలు చేద్దామన్న నిజాయతీపరులైన పోలీసు అధికారులకు కూడా నిస్పృహ రాకమానదు.

ప్రజాభిప్రాయం అలా ఉంచి, న్యాయశాస్త్రం పోలీసుల్ని ఎలా పరిగణిస్తోంది? పోలీసులకి వృత్తిమీద గౌరవం, అభిలాష ఉండాలంటే న్యాయపూర్వకంగా వారికి సముచిత స్థానం ఇవ్వాలి. నేటి న్యాయసూత్రాలు పోలీసులకి అవమానకరంగా ఉండటం వలన, వాటిని అధిగమించి కార్య నిర్వహణలో అకృత్యాలు జరపటం చూస్తున్నాం. సూత్రప్రాయంగా పోలీసులు తు.చ. తప్పకుండా పని చేయాలంటే ఫలితాలు లభిస్తాయా? ఫలితాలు లేకుంటే ప్రజలు సహిస్తారా? అన్న మీమాంస రాకపోదు.

ఏ సమాజంలో అయినా పోలీసువృత్తి ఆకర్షణీయం కాదన్నమాట వాస్తవమే! న్యాయం, న్యాయం అంటూ గంభీర ఉపన్యాసాలు చేస్తూనే న్యాయ పరిరక్షణలో ముఖ్యపాత్ర వహించవల సిన పోలీసులనే దిగనాడుతుంటే, న్యాయం ఎక్కడనుంచి వస్తుంది? పోలీసులు అమానుషు లని, అవినీతిపరులని వెయ్యినోళ్ల విమర్శిస్తుంటే ప్రాణం విసిగి వాళ్లు ఆ లక్షణాలను

అలవరచుకుంటారన్నది సాంఘిక శాస్త్రంలో ఒక ముఖ్య సూత్రం. పోలీసు వ్యవస్థ నిర్దుష్టంగా, నిష్పాక్షికంగా సమర్థవంతంగా కర్తవ్య నిర్వహణ చేయాలంటే అనుకూల ప్రజాభిప్రాయం, న్యాయశాస్త్ర అంగీకారం పొందాలి. అంతవరకూ పరిస్థితులని మెరుగు పరచాలనే ప్రయత్నాలు అడవిగాచిన వెన్నెలే!



దాదాపు 50 ఏళ్ల పరిధిలో జరిగిన సంఘటనలు, అనుభవాలు పోలీసు వృత్తిలో ఉండే వైరుధ్యాలని నిరూపిస్తాయన్న ఆశతో ఈ గ్రంథం వ్రాశాను. పోలీసు అకృత్యాలు, దౌర్జన్యాలు, అధికార దుర్వినియోగాలు ఎన్నోచోట్ల తటస్థపడ్డాయి. అవి కాదనలేము. కొన్ని నిజం. కొన్ని అతిశయోక్తులు. అసత్యాభియోగాలు కోకొల్లలు. భవిష్యత్తులో రాజకీయ పరిణామాలెలా ఉన్నా రెండు ముఖ్య సంశయాలు రాకమానవు. ఒకటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులు ఆధారంగా సమాజ పురోగమనానికి వీలుగా శాసనాలు వస్తాయి. అవి అంత సులభంగా అమలుకావు. వాటిని ప్రతిఘటిస్తూ హింస చెలరేగే సూచనలు కనపడుతున్నాయి. రెండవది: రాజకీయ వాతావరణం బహుముఖంగా పరిణామాలు చెందుతున్నప్పుడు అధికారం కోసం, ఆశయాల కోసం చివరకి దురాక్రమణలు, ఉగ్రవాదుల దౌర్జన్యకాండలు ఎక్కువ అయ్యేట్లు కనపడుతున్నది. ఈ పరిస్థితులలో న్యాయపరిపాలన సుస్థిరంగా నెలకుంటుందా? పోలీసు వ్యవస్థకీ అవాంతరాలని తట్టుకొనే శక్తి ఉంటుందా? కాబట్టి ఆ సంస్థని సాంఘికంగా బలపరచి ప్రజానురంజకంగా తీర్చిదిద్దే సంస్కారణలు చేయవలసిన అవసరాన్ని చాటుతుంది.

నేడే కాదు, గత నాలుగు దశాబ్దాల లోనూ మన రాజకీయ నాయకులు అవకాశం చిక్కినప్పుడల్లా 'పోలీసులు వలస విధానాలను మార్చుకొని ప్రజాస్వామ్యానికి అనుగుణంగా ప్రవర్తించాల'ని గంభీరోపన్యాసాలు ఇస్తూ ఉంటారు. నలభై ఏళ్ల స్వాతంత్ర్యం తరువాత వలస రాజ్యం గురించి ఈ నాటికీ మాట్లాడడం ఔచిత్యం కాదు. సంస్థలో మార్పు రావాలంటే సమూలంగా దాని గమ్యాలు, విధానాలు, యంత్రాంగం మారాలి. కాని దురదృష్టవశాత్తు మనం ఆ పూర్వ నిబంధనలనే పట్టుకొని వ్రేళ్లాడుతూ వాటిలో ఉన్న సద్గుణాలు కూడా రూపుమాపేశాం. పోలీసులు ఎదుర్కొనే సమస్యలు, చిక్కులు, పరీక్షలు సాధారణమైనవి కావు. కొన్ని మార్పులు తెచ్చినా వ్యవస్థలో సుముఖమైన సరళి రానందుకు కారణాలు గట్టిగా వెతకనవసరం లేదు.

ప్రప్రథమంగా విభిన్నవర్గ మిళితమైన మన సమాజానికి ఎటువంటి సంస్థ కావాలి? ఉదాహరణంగా మూడింటిని పేర్కొనవచ్చును. అమెరికాలో 40వేల విభిన్న పోలీసు వ్యవస్థలున్నా సమన్వయ లోపం కనపడదు. ఫ్రాన్సులో పోలీసు సంస్థల విధానం వేరు. కాని రాజకీయ జోక్యాలమాట వినపడదు. ఇక ఇంగ్లాండు అంటారా? పోలీసు సంస్థలు స్థానిక పరిపాలన యంత్రాంగాలకి బాధ్యులైనా వాళ్ల కార్యక్రమాలలో ఇతరుల ప్రభావం లేకపోవటమే గాకుండా పోలీసుల మీద ఉన్న అభిమానం మరెక్కడా కనపడదు. మనదీ ప్రజాస్వామ్యమే! మరి మనకెందుకీ క్షోభలు? ఈ ప్రశ్నకి సమాధానం ఇవ్వవలసింది పోలీసులు కాదు - అధికార పగ్గాలు గుప్పిట్లో పెట్టుకున్న రాజకీయ నాయకులే!

పోలీసుల నిష్పాక్షికతను గురించి పదే పదే విమర్శలు రావటం మామూలే. అభియోగాలలో పోలీసులు ఒక వాదిగా ఉండటం వలన అది లోపించక తప్పదు. అంతే గాకుండా రాజకీయంగా సమకూర్చిన శాసనాలు అమలు చేయటంలో పోలీసులు ప్రభుత్వ పక్షపాతులే గదా!

ఈవిధంగా బాధ్యతలు విభజన అయిపోయి పోలీసులు క్షతగాత్రులవుతున్నారు. నిజంగా పోలీసు వృత్తి కత్తిమీద సాము!

మరి ప్రత్యామ్నాయం ఏమిటి? రాష్ట్ర స్థాయిలో డైరక్టరు జనరలు రాష్ట్ర ప్రభుత్వానికి బాధ్యుడు కాబట్టి, ఈ బాధ్యతని వేరు వేరు స్థాయిలలో ఇతరులకి అప్పచెప్పటం అక్రమంగా కనిపించక మానదు. ఎప్పుడో నిర్మించిన పరిపాలనా యంత్రాంగం ఈనాటికీ స్థిరంగా ఉండాలంటే అది సంస్కరణకి ఆటంకం కల్పించక మానదు. ఇంకో ప్రక్కన రాజకీయ జోక్యం బలవత్తరమై పోలీసులని క్రుంగదీస్తోంది. ఈ రెండు సమస్యలూ పరిష్కరించాలంటే నేను ఉదహరించినట్లు పోలీసు --- ముఖ్యంగా నేరపరిశోధన, అభియోగ కార్యకలాపాలు పర్యవేక్షించటానికి రాష్ట్రస్థాయిలో ఒక సంయుక్త న్యాయ కార్యాచరణ సంస్థ ఏర్పరచాలి. అలాంటి సంస్థ ప్రస్తుత పరిస్థితులలో అవసరమే గాకుండా ప్రజల్ని, పోలీసుల్ని దగ్గర చెయ్యడమే గాక పోలీసు ప్రవర్తనను ఒక కంట కనిపెడుతూ ఉంటుంది.



దిన దినమూ వివిధ రూపేణా దిగజారిపోతున్న మన సమాజంతో ముడిపెట్టుకున్న నా వృత్తి జీవిత విశేషాలు మాత్రమే చోటు చేసుకున్నాయి. మానవుడిగా, పోలీసు అధికారిగా నా జీవితంలో ముఖ్యఘట్టాలను మాత్రమే స్పృశించాను. ఈ ప్రయత్నంలో పదే పదే సామాన్య పౌరుడిగా, పోలీసు అధికారిగా జీవితం ఏవిధంగా సాగింది అన్నదే ముఖ్య విషయం. కాని ఈ రెండింటిని వ్యక్తిగతంగా, వృత్తిపరంగా విభజించటం సులభమా? ఇద్దరి మధ్య వైరుధ్యం వచ్చినప్పుడు నా మానవత్వం లోపిస్తుందా? లేక పోలీసుగా వృత్తికాఠిన్యం జయిస్తుందా? మంచి అయినా, చెడు అయినా వ్యక్తిలో సమీకృతమై పోయిన మానవ ప్రకృతే జయిస్తుంది. సత్పురుషుడు, సహృదయుడైన పోలీసు అధికారిగానే ఉంటాడు కాని చుట్టూ ఆవరించుకున్న కాలుష్య వాతావరణంలో సహృదయతతో నిలదొక్కు కోవటం కష్టతరం అయిపోతుంది. ఈ వ్యాసంగంలో నీతి ఇదేనేమో!

నేను సాధారణ మానవుడిని. మహాత్ముడిని కాను. సాధారణ మానవుడికుండే గుణాలు, దుర్గుణాలూ నాలోనూ ఉన్నాయి. కాని తెలిసినంతవరకు నా ఆత్మసాక్షికి వ్యతిరేకంగా పోలేదు. స్నేహితులు, అభిమానులు, శిష్యులు ఎంతో గౌరవం, అభిమానం నాపై చూపిస్తున్నారు. మూడు దశాబ్దాలుగా చేసిన పరిశోధనా కృషికి, నేరశాస్త్రంలో రచించిన విజ్ఞాన పూర్వకమైన గ్రంథరచనకు, తృణము, పణము తెలుగు సాహిత్య ప్రయత్నాలకి ఫలితంగా ఆంధ్ర విశ్వవిద్యాయం గౌరవ పూర్వకంగా డి.లిట్ బహూకరించడం కూడా ఈ సమయంలో జరిగింది. అంతకంటే ఏంకావాలి. నాకు తీరని కోరికలు లేవు. అందని మానిపండ్లకై అర్రులు చాచలేదు. ఒకరిమీద అసూయలేదు. ఏడుపదులు నిండిన నేను, నా శేషజీవితాన్ని నిశ్చింతగా వ్యామోహాలకు అతీతంగా గడుపుతూ ఆనందానుభూతులు పొందుతున్నాను.

వృత్తిపరంగా ఈవిధంగా వ్యాఖ్యానించేందుకు సాహసం చేయలేక పోతున్నాను. ప్రథమ దశలో పోలీసు ఉద్యోగం జంకు బొంకు లేకుండా చేశాను. వెను దిరిగి చూసుకుంటే ఆ ధైర్యం, పట్టు ఎలా వచ్చిందో కాని నాకవి ఇప్పుడు సంపూర్ణమైన తృప్తినిస్తాయి. ఈ పరిస్థితి రెండవ దశలో మారింది. కొన్ని పర్యాయాలు నా సహోధ్యాయులు, పై అధికారుల అహంభావం ఆగ్రహం చివరకి అసూయ కూడా నన్ను వ్యథపరచిన మాట వాస్తవం. ఏది చెయ్యబోయినా అడ్డుపెట్టే విరసులు లేకపోలేదు. నాకు అంతర్జాతీయంగా పేరు ప్రతిష్ఠలు వచ్చినా పెదవి

విరచిన వారు, "పోలీసు మేధావి" అని వ్యంగ్యంగా మాట్లాడిన వారు లేకపోలేదు. మానసికంగా బాధాకరమైన ఇలాంటి భావాలు ప్రతి సంస్థలోనూ ఉంటాయి. కాబట్టే వాటిని పేర్కొనటం గోరంతలు కొండంతలు చేయటమే! కాని ఈ రెండవ దశలోనే నాకు అపూర్వమైన గౌరవం వచ్చింది. జాతీయ స్థాయిలో ఒక ఉన్నత స్థానం అధిష్ఠించాను. దేశ దేశాలు పర్యటన చేశాను. ఇది అంతా నా ప్రజ్ఞే అనుకుంటారేమో! నాకు ఉత్సాహం కల్పించి, అవసర సహాయం చేసి గౌరవంతో, ప్రేమతో, ఆప్యాయతతో చూసిన మహానుభావులెందరో? అందరికీ వందనాలు. అట్టివారి సాహచర్యం నా అదృష్టం. పదవీ విరమణ తరువాత దాదాపు ఒకటిన్నర దశాబ్దాలు తిరిగినా నా సేవలు, అభిభాషణలు, అభిప్రాయాలు అడుగుతూనే ఉన్నారు. నా జీవితం ముగియ బోతోందన్న విషయం నాకు తెలుసు. వృద్ధాప్యం మనిషిని క్రుంగదీస్తుంది. అయినా శక్తికొలది నలుగురికి ఉపయోగపడే విధంగా సేవ చేయటం నా ధర్మం. అందులోనే నామహదానందం. ఇదే నాకు జీవితం ఇచ్చిన మహాపారితోషికం.

ఈ రచనలో సందర్భానుసారంగా వికృతంగా మారిపోతున్న మన సమాజంలో పోలీసు వ్యవస్థ భవిష్యత్తేమిటి? అది సమాజానికి శ్రేయోదాయక సంస్థగా ఎలా రూపొందాలి అని తర్కించాను. పునరుక్తి దోషానికి క్షంతవ్యుడిని. కాని మరోసారి ఆ విషయం సూక్ష్మంగా వివరించక తప్పదు.

పోలీసు జవానులు, అధికారులు సమాజంలోంచి వచ్చినవారు కాబట్టే దానికంటే ఉన్నతంగా ఎలా ఉంటారు? ప్రస్తుతం మనదేశంలో నీతి నియమాలు అడుగంటుకుపోతున్నవి. పరిపాలనా యంత్రాంగాలు తమ విశిష్టతను కోల్పోతున్నాయి. కుల, మత, ప్రాదేశిక విభేదాలు ప్రగాఢమైపోతున్నాయి. హింసాయుత చర్యలు సాధారణ చర్యలుగా భావించే పరిస్థితులు వచ్చాయి. అవినీతి, బంధుప్రీతి, బానిసత్వపోకడలు మనదేశ ఐకమత్యానికి లక్ష్యాలకి ఆఘాతం కల్పిస్తున్నాయి. ఉగ్రవాదం పైశాచిక కదం త్రొక్కుతోంది. పోలీసులు అసంఖ్యాకంగా ప్రాణాలు కోల్పోతున్నారు. జనాభా అదుపు తప్పి క్లిష్టమైన ఆర్థిక దుస్థితిని కల్పిస్తోంది. వర్గపోరాటం బలిష్ఠమౌతోంది. న్యాయపరిపాలన నామమాత్రం. ఈముఖ్య సాంఘిక సమస్యలు పట్టించుకోకుండా, అందలంకోసం, అధికారం కోసం రాజకీయ నాయకులు ప్రవర్తిస్తున్నారు. విషమమైన ఈ యుగ సంధిలో సమర్థవంతమైన పోలీసు సంస్థ ఆవిర్భవిస్తుందా? అన్న శంక ప్రతిపౌరుడికి రాక మానదు.

జరిగిపోయిన విషయాలు అనూహ్యంగా మారిపోతున్న స్థితిగతులలో భవిష్యత్తుకు బాటలు వేస్తాయా? భవిష్యత్తే అంధకారంగా కనిపిస్తున్న సమయంలో హింసాయుత ఉగ్రవాదం వల్ల వ్యక్తిరక్షణ ముఖ్యమై కోటానుకోట్లు వెచ్చించవలసి వస్తున్నప్పుడు సమాజ రక్షణ అడుగంటిపోక తప్పదు. కాని జీవితం ఉన్నంతవరకూ ఆశ ఉంటుంది కదా! ఏ అనూహ్య కారణాల వల్లనైతేనేమి భవిష్యత్ ప్రభావం మనం ఇప్పుడూహిస్తున్న వికృతరూపం దాల్చక పోవచ్చు. భవిష్యత్తులో రాజకీయ నాయకత్వం అభిలషణీయంగా, విజ్ఞానవంతంగా పరిణమిస్తే సమాజం స్థిరత్వం పొందటమే గాకుండా పోలీసు వ్యవస్థకూడా ప్రజాసంక్షేమ సంస్థగా రూపొందవచ్చునని ఆశిద్దాం.

**పై వ్యాసము "పోలీసు ప్రస్థానం" అనే గ్రంథం నుండి తీసుకొనబడినది.**

వెల రూ.40/- ప్రతులకు: "సురక్ష" కార్యాలయం, డి.జి.పి. ఆఫీసు కాంప్లెక్సు, లక్డీ-కా-పూల్, హైదరాబాద్-500 004.

– సం.

# నవ్య కవిత్వంలో
# భిన్న తత్వ సమన్వయం

- శ్రీ వి.వి.ఎల్. నరసింహారావు

''స్కందపురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీనందను సత్కథోద్యమము; నవ్యకవిత్వకలా కలాపమన్ కుందనమున్ ఘటించి కడుక్రొత్తగు సొమ్ము'' గ్రేసేస్తున్నా నన్నాడు రామకృష్ణుడు. నిజానికి ప్రబంధయుగంలో వచ్చిన కవిత్వంలో పాండురంగమాహాత్మ్యం రచన ఒక నవ్యత్వాన్ని తెచ్చింది. ఈ విషయం అతని కవిత్వాన్ని సావధానంగా పరిశీలించిన ప్రాజ్ఞులందరికీ తెలుసు. అట్లాగే ఈ 20వ శతాబ్దపు నవ్య కవిత్వంలో ఇంతకుముందటి కవిత్వంలో లేని నవ్యత ఏమున్నది?

ఈ నవ్యకవితాతత్త్వాన్ని పరిశీలించ బోయేముందు మన కో సందేహం కలుగుతుంది. సమకాలీన కవిత్వం అన్నప్పుడు పద్య గద్య గేయ రచనల్లో ఉన్న సర్వ సాహితీ శాఖల్ని దృష్టిలో ఉంచుకోవాలా? అక్కరలేదా? ప్రాచీన కవిత్వాన్ని గూర్చి అయినట్లయితే మన కీ ప్రశ్నే రాదు. ఆ కాలంలో వచనరచనలే మృగ్యం. చంపూ కావ్యాల్లో వచనం అన్నది ఒకటున్నా దానిమీద విడదీయ రాని ఛందఃప్రభావం ఒకటి ఉండనే ఉన్నది. ఒక్కొక్కచోట ఆవచనం పూర్తిగా పద్యంలాగే నడుస్తుంది. నన్నయ భారతంలో దుష్యంతుడు కణ్వాశ్రమం చేరడానికిముందు ''ఇట్లు పెక్కు మృగంబుల నెగచి చంపుచు'' అన్న వచనం ఉన్నది. దీని ఎత్తుగడ అంతా గీతపద్యంలాగే ఉన్నది. ఇలాగే ఎన్నో ఉదాహరణ లివ్వవచ్చు. కాబట్టి ప్రాచీనకవితాతత్త్వం పరిశీలించవలసి వస్తే మనదృష్టిలో పద్యరచనలే ఉంటాయి. కాని, ఆధునిక యుగంలో అట్లా పరిశీలించడానికి వీలుకాదు. నవ్యకవిత్వం అన్నప్పుడు వచన రచనలు కూడా దృష్టిలో ఉంచుకో వలసివచ్చినా పద్య గేయ రచనల్ని మాత్రమే తత్త్వదృష్టితో పరిశీలించ దలచుకున్నాను.

కవితా నిర్వచనాలు స్ఫురించడం తోటే మనకు జగన్నాథ పండిత రాయల సమగ్రసుందరమైన కావ్యనిర్వచనం జ్ఞప్తికి వస్తుంది. దీనికి కారణం పండితరాయలు మన ఆంధ్రుడు కావడం కాదు. 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్య'మన్నది సమగ్ర నిర్వచనం కావడమే. పాశ్చాత్య రచయిత లనూ, ఆలంకారికులనూ సహృదయతతో పరిశీలించిన విమర్శకుల దృష్టికి 'ఆలెన్ పో' అనే ఒక అమెరికా రచయిత కవిత్వం గురించి చేసిన నిర్వచనం మన పండితరాయల నిర్వచనానికి చాలా సన్నిహితంగా ఉన్నది. 'కవిత్వం లయానుకూలమైన సౌందర్యసృష్టి' అంటాడు ఆ రచయిత. అంతర్దృష్టితో కావ్య సౌందర్యం అనుభవించిన ఆలంకారికుల దేశకాలాలు భిన్నములైనా దర్శనం ఒకటే కావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. అందువల్లనే మన విమర్శకుల్లో కొందరు 'పో'ను అమెరికాదేశపు పండితరాయలని ముచ్చటగా అంటారు.

ఇక మన నవ్యకవిత్వంలో కూడా రమణీయార్థ ప్రతిపాదక కావ్య సౌందర్యం ఎట్లా వ్యక్తమైందో భిన్నతత్త్వముల దృష్ట్యా పరిశీలన చేద్దాం.

ప్రపంచంలోని ఏ దేశకవిత్వం చూచినా మూడు ముఖ్యమైన అవయవా లందులో ఉండి తీరుతాయి. ఒకటి వస్తువు. రెండు భాష. మూడు ఛందస్సు. ఆకవిత్వం ప్రాచీనం కానివ్వండి, అర్వాచీనం కానివ్వండి, ఆధునికం కానివ్వండి - పై మూ డవయవాలు లేకుండా ఉండదు. కాకపోతే

సమకాలిక అభిరుచులనుబట్టీ, పరిస్థితులనుబట్టీ ఆ మూడింటిలో కొన్ని మార్పులు రావచ్చు. ఒకొక్కసారి సమకాలీన అభిరుచులను శిక్షించి లోకం మరమ్మతు చేయాలని భావియుగాల్లో రానున్న సమాన ధర్మాని కోసం తహతహపడే సంస్కర్తలూ ఉండవచ్చు. అటువంటివారి కవిత్వంలోనైనా పై మూడవయవాలు ఉండి తీరవలసిందే.

కేవలం వస్తువు లేక ఇతివృత్తం దృష్ట్యాచూస్తే నవ్యకవిత్వంలో విశిష్టములైన తత్వాలు కొన్ని ద్యోతక మౌతున్నాయి.

## జాతీయతా దృష్టి

బానిస భారతదేశంలో పాశ్చాత్య పాలనం సహించరానిది కావడంతో దేశంలో రాజకీయంగా స్వాతంత్ర్యోద్యమంతో పాటు కవిత్వంలో కూడా జాతీయతాదృష్టి ప్రాకిపోయింది. కాలక్రమంగా భారత జాతీయతతో పాటు రాష్ట్రాభిమానం, ఆంధ్ర జాతీయత వీను మిగిలి కవుల ననేకుల్ని జాతీయమైన ఇతివృత్తంతో స్వాతంత్ర్యగుణ గానానికి ప్రోత్సహించాయి. ఒక ప్రక్క ''దేశమును ప్రేమించుమన్నా' అంటే ఇంకొక ప్రక్క ''శ్రీలు పొంగిన జీవగడ్డయి, పాలినది మన భరతవర్షం'' అని హెచ్చరించడం జరిగింది. ''తేటల్ తేరెడు కాంతిపూరముల నుద్దీపించు ముత్యాల ముప్పేటల్ వోలె త్వదీయ కంఠమున శోభింపుల్ నిగారింపుచు, ఏ నాటన్ జీవన శోషణల్ గనని కృష్ణా గౌతమీ పెన్నలన్'' కాంక్షాక్షీరాలు గ్రోలవలె నని కవులు జాతీయతాభిమానం పెల్లుబుక కవిత అల్లారు. ''గోదావరీ పావనోదార వాఃపూర మఖిల భారతము మాదే'' అన్న పూర్వస్మృతులు జ్ఞప్తికి తెచ్చుకొని కవి విశ్వనాథులు కమ్మని కవితాగానాలు చేశారు. కొడాలివారి హంపీ క్షేత్రం, కొండూరి వారి అమరావతి, ఇంద్రగంటివారి దక్షారామం మొదలైన వెన్నో ప్రాచీనార్వాచీన ఆంధ్రశిల్ప రామణీయ కాన్ని కావ్యశిల్పంలో పొదిగి రసజ్ఞలోకానికి అందించాయి. ఈ విధంగా కవులకు తుమ్మలవారికి వలె ''రాష్ట్రగానం'' ఒక ఆదర్శంగా నిలిచిపోయింది. కాని ఇటీవల ఈ రాష్ట్రాభిమానం తెనుగుమీరి ''మడమ త్రిప్పని తెనుగువీరుడను నేను'' అనడానికి బదులు ''గోడ దూకని తెలుగు భక్తుడను నేను'' అనే స్థితివరకూ వచ్చింది.

## సాంఘిక దృష్టి

జాతీయతా దృష్టితో పాటు దేశములో సంఘ సంస్కార దృష్టికూడా ప్రధానమై పోయింది. ఆదుసంతు గల బహుకుటుంబికుల బాధలు కళ్ళారా చూచిన కవుల మనస్సులు కరిగిపోయాయి. ''అగ్ని ప్రవేశం'' వంటి కావ్యాలు అటువంటి దృష్టితోనే వెలశాయి. ''సుంక మీయక మంగళసూత్ర మునకు యోగ్యురాలుకాదేని ఆ కన్నె జీవితము నేల కాల్పరాదు... అడుగరే ఒక్కరైన యీ ఆర్య సుతుల?'' అన్న ప్రశ్న పరంపర వెలువడ్డది. ఇటువంటి సాంఘికమైన ఇతివృత్తం తీసుకున్నా కావ్యమును రాజకీయ ఉపన్యాస వేదికగా గ్రహించకుండా శిల్పదృష్టితో ఉత్తర కథార్థసూచన మొదలైన విన్యాసాలు వెలయించారు. ఇది యిట్లా వుండగా మహాత్ముని హరిజన సేవాపరాయణత్వం, అస్పృశ్యతా నిర్మూలనం మొదలైన సిద్ధాంతాలు కవులను పూర్తిగా ఆకర్షించాయి. శ్మశాన వర్ణనంలో కూడా ''ఇట నస్పృశ్యత సంచరించుటకు తావే లేదు'' అని ''నాల్గు పడగల హైందవ నాగరాజును'' ఎత్తి పొడవడం కూడా జరిగింది. 'స్వయంవరం' అన్న కావ్యంలో హిమవత్పర్వత వర్ణనం చేస్తూ ''మంచుమల మీది శ్వేత సామ్రాజ్య ఫలము - సమతగనవచ్చు వర్ణ భేదములు లేక'' అన్నాడు. ఇక్కడ హిమవంతం మీది స్వచ్ఛమయిన తెల్లనిరంగులో వివిధములైన రంగులు లేని సమత్వం కనిపిస్తుందనేది బాహ్యార్థమే అయినా కవి అర్థాంతరస్ఫూర్తి వేఱు. మంచుకొండ కీవల తెల్లవారు పాలించి విడిచిన భరతసామ్రాజ్యఫలం కులమత వర్ణ భేదములు లేకుండా సమతాభావంతో అనుభవిం చాలని కవి తాత్పర్యం. వస్తువు సాంఘికమైనదే అయినా ఇటువంటి రమణీయములైన అర్థాంతర

స్ఫూర్తులతో ఉత్తమ కావ్యలక్షణాలు ప్రతిపాదించారు ఆధునికులు. పతిత మానవుని సందేశం భగవానుని కందించిన గబ్బిలానికి ''ఆమూలాగ్రంబుగ భ్రష్టులై తిరుగు బాబుల్ దొడ్డ గంజాయి భాయీలు'' కొందరు కనిపిస్తారట. ఈ విధంగా సంఘంలో భ్రష్టుల్ని వేలెత్తి చూపడం కూడా కవుల సంస్కరణ దృష్టికి ప్రబల నిదర్శనం. హరిజనులు దేవాలయ ప్రవేశం చేయడం ఆవశ్యకమని కవి చేయెత్తిప్రయోగించిన ''గుడిగంటలు'' నవ్వడులలో కవికి సాంఘిక సమస్యల మీద ఎంతటి సమ్యగ్దృష్టి ఉన్నదో స్పష్టం. మరికొందరు మెత్తని మనస్సుగల కవులు 'పాకీపిల్ల'ను చూడడంతో కరుణ జాలువారి ఖండకావ్యాలలో ఆమె సహనశీలాన్ని కీర్తించారు.

ముఖ్యంగా ప్రజాస్వామ్య తత్త్వం కవుల దృష్టిని బాగా ఆకర్షించింది. ''పేదల రక్తమాంసముల పెంపువహించి దయారసామృతాస్వాద దరిద్రులైన ధనవంతుల'' పెద్దరికం కోసం, మతోన్మాదం పెంచే దేవునికి మారుగ నిలిచే రాతిబొమ్మల్లో ఊదరపోయే పాడుబ్రతుకు ఒక్కనిమేషం అక్కర్లేదని తమ ''కాంక్ష'' వెల్లడించారు వేదులవారి వంటికవులు. జి.వి. కృష్ణారావుగారి యుగసంధ్యలో కూడా ప్రజాజీవితా లనేకం బలిగొని రక్తనదుల్లో కరకుకత్తిని స్నాన మాడించి వచ్చిన ప్రభువుగారి జైత్రయాత్రను వర్ణించి కావ్య మల్లడానికి సమ్మతింపని ఆస్థానకవి, భార్యతో జరిపే సంప్రతింపుల్లో ప్రజాస్వామ్య సూత్రములే ప్రాధాన్యం వహించాయి. ఇంతే కాకుండా ఇటీవల రాజకీయ ఉద్యమచరిత్రలే కావ్యరూపం తాల్చుతున్నాయి. ఇటువంటి రచనల్లో కావ్యలక్షణాలు ఎంత వర కున్నాయో జాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

## ప్రకృతి పరిశీలన దృష్టి

నవ్యకవులలో అధిక సంఖ్యాకులు ప్రకృతిని కేవలం దూరంగా ఉండి పరిశీలించడం మాత్రమే కాకుండా ప్రకృతితో తాదాత్మ్యమే పొందారు.''ఆకులందున అణగి మణగి కవితకోకిల పలుక వలెనోయ్'' అనడంతో తృప్తినందక ''ఆకులో ఆకునై పూవులో పూవునై'' పోతానని పరవశించి పోయారు కవులు. నిజానికి ఈ నవ్యకవులు ప్రకృతిని పూర్తిగా విశ్వసించారు. ప్రకృతికూడా వీరి కన్ని విధాలా సాయపడి కవితావస్తువు కోకొల్లలుగా అందించింది. ప్రకృతికీ మానవునికీ ఉన్న సంబంధం కవి బాగా గుర్తించాడు. అందులో నవకవులకు ఆంగ్ల సాహిత్యంతో సంబంధం కూడా ఒక అపూర్వమైన అనుభవాన్ని ప్రసాదించింది.

ఈ విధమైన ప్రౌఢ సాహిత్య పరిచయంతో కవులు ప్రకృతిని శంకించడం మానేసి నిత్యం భక్తితో ఉపాసించడం ఆరంభించారు. ''నెలవంక చిరునవ్వు చలువ పాటలూ, ప్రొద్దుపొడుపు మంచు కన్నీరు పాటలూ, పావురాయుయ్యాల పక్షాలయంచుల జాలులౌ గాలినీలాలపాటలూ,'' కావ్యగానంలో అమృతపు సోనలు ప్రవహింపజేశాయి.

ఇక పల్లెపట్టుల పొలాలలో 'గనిమల తుంగకూ గరిక కాడలకూ అల్లిన సాలెగూళ్ళలో పడిన సన్నని పటికంపు మంచుబొట్లు నాణెపు ముత్తెసరాలలాగు కనుగొన రమ్యమయ్యె''నట రవికాంతు లతో తేలిపోతూ. అటువంటి సుందరసన్నివేశాలను కృషీవలుడుకూడా జాగ్రత్తగా చూస్తూ, అడుగులు పదిలంగా వేస్తూ నడువవలెనని కవికోకిలలు హెచ్చరిక చేశాయి.

## జానపద (వాఙ్మయ) దృష్టి

జనపదాలలో అమాయికములైన జీవితాలు గడుపుతూ లోకానికి అమృతాన్నం పండించి ఇచ్చే కర్షకుడు కావ్యనాయకుడై క్రొత్త దనాన్ని తెచ్చాడు - 'క్షేత్రలక్ష్మి'ని లాలించి పాలించి సర్వజనులకూ సస్యసంపద సంతరించే సైరికుడు ప్రౌఢనాయకుడైనాడు. ఎండనుబడి పొలంలో వేగే తనకు అన్నపుదుత్త తెచ్చిన భార్యతో అతడు జాలిగా ''అతకల్ లేవె మరేమి వెట్టిపడుచా, ఆపాద మస్తంబు

పెన్జితిపై చూడిన భంగి భగ్గుమనె'' నంటూ ఓదార్చడం కావ్యవస్తువు అయినది. జానపదదృశ్యాలను జనులు మాట్లాడే తేట తెలుగు మాటలు యథాతథంగా ఛందోబద్ధం చేయడం కష్టమే. సంభాషణరీతుల్లో భావావేశం జారకుండా పలికినదాన్ని పలికినట్లు పద్యంగా వ్రాయడంలో ఏటుకూరి కవిబ్రహ్మకగ్రతాంబూలం ఇచ్చి తీరాలి. పదపదంలోనూ జాతీయత తొణికిసలాడేటట్లు మాటమాటలోనూ కమ్మనిలోకోక్తులు దొరలిపడేలాగు కవిత చెప్పిన అచ్చపు తెలుగుకవి ఏటుకూరి. పాల్కురికి సోమనాథుడు పారవశ్యంతో ''ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన మానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు; తెలుగుమాట లనంగ వలదు; వేదముల కొలదియ కా జూడుడు'' అన్నాడు. ఉభయకవి మిత్రుడైన తిక్కనకూడా 'జాత్యము కామి నొప్పయిన సంస్కృత మేయెడఁ జొన్ప''నన్నాడు, అంతేకాదు.

''తెలుగు కవిత్వము చెప్పందలచిన కవి అర్థమునకు తగియుండెడి మాటలుగొని వళులుం బ్రాసంబులు నిలుపక యొగిని పులిమిపుచ్చుట చదురే?''

అనికూడా అన్నాడు. మహాకవి తిక్కన భాషావిషయికంగా దేనికోసం తపించి కావ్యరచన చేశాడో ఏటుకూరి కవి దానిని సహృదయతతో అర్థంచేసుకున్నాడు. అందుకనే సలక్షణమైన ధోరణిలో జానుతెనుగులో కవితారచన సాగించి 'కవి బ్రహ్మ' అనిపించు కున్నాడు. ఈతని రచనలో కూడా సన్నివేశ సందర్భాలను బట్టి తిక్కన రచనలోవలె లలితమైన హాస్యం ఎడనెడ తొంగిచూడకపోలేదు. క్షేత్రలక్ష్మిలో మంచెమీదనుండి పిట్టలనుతోలే అత్తాకోడళ్ళ సంభాషణ దీనికి చక్కని నిదర్శనం.

అత్త: 'అసిపిల్లా పరియాచకమ్ములటె పెద్దబ్బాయికిం జెప్పి నీ పస పట్టింతును చూడు' అనడం,

కోడలు: కాదత్తా, తెగరుంజుకొందువు... నీ చాదస్తమ్మణ గారు'' అని చెప్పడం,

తిరిగి అత్త: ''ఔనే మాటల నేర్చు కుక్కలిటు గయ్యాళించి పైకొన్నచో నేనే కా దెవరేమిచేయగల, రేయయ్య కంతానన్ తగిలింతురో అతని ప్రాణాలార్తువే కోడలా?'' అనడం -

కోడలు: ''అదె, మామామ వచించు, నెల్లపుడు మీ అత్తయ్య నోరేమిటో కదిలాడించిన రేగు గం పనుచు'' అని రెండు వడ్డించడం - మొదలైన దృశ్యాల్లో ఏటుకూరి తెలుగు పలుకుల సౌకుమార్య సౌందర్యాలు అనిర్వచనీయాలు -

ఈ విధంగా ఆధునికులు క్రొవ్వు కారెడి ప్రబంధనాయికల స్థానంలో - ఒయ్యారంగా మంచెమీద నిలిచి ఒడిసెల రాయి విసరడంలో ఒడుపులు ప్రదర్శించే పేద కాపుకోడలిని ప్రతిష్ఠించి క్షేత్రలక్ష్మిని దర్శించారు.

ఇవి ఇట్లా ఉండగా మరో ప్రక్క ఋతువు ఋతువుకూ ఒక క్రొత్తరూపు సవరించుకొంటూ ''తెలుగు సత్కవిరాజు పలు కందుకోలేని జలముల్లప్రోవులై'' కిన్నెరవాగులు గలగలా ప్రవహించాయి. నీవు రసాకృతి వౌదువు, నేను శిలా హృదయుండను, పూనుదునె ధునీవైఖరి ఓహోకిన్నెర సానీ'' అని తత్ప్రియుడు పొందిన వేదనలో ఆలంకారిక రామణీయకంతో అమాయకులైన జానపదుల పవిత్ర ప్రణయమే భాసించింది. ఇక నాయుడుబావ నీడలోనే మేడ కట్టుకున్న ఎలుతురు పిల్లలాంటి ఎంకి బ్రదుకులో జానపద సాహిత్యపు అమృత సౌరభాలు దిగంతాలు వ్యాపించాయి. సామాన్య దృష్టిగల చిలిపివారికి 'ఆరిపేయవె దీపమూ' అన్న అర్థమే స్ఫురించి తత్త్వదృష్టితో పరిశీలించిన పెద్దలకు నాయుడుబావా ఎంకీ ఆధ్యాత్మిక సమన్వయంతో ప్రత్యక్షమయ్యారు. సంసార సంతరణానికి నాయుడుబావ అనే జీవునకు ఎంకి సాధకురాలట! నిజానికి ఈ దృష్టిని ఆధ్యాత్మికదృష్టి అనడంకంటే మర్మదృష్టి అనడం ఉచితం.

## మర్మ దృష్టి

ఈ మర్మదృష్టి అన్నది ఆధునిక విమర్శకులు కొందరు ''ఇంద్రియాల్ని అంతర్ముఖం చేయడానికీ, కవిత్వంలో ఇటీవల వినిపించే ట్రాంబండ్ల గడబిడలను అణచడానికీ ఫ్రెంచిదేశంలో 'బాడిలేర్' అను మహాశయుడు సృష్టించా''డని అన్నప్పటికీ భారతీయ కవితకు ఈ మర్మదృష్టి అపూర్వం కాదని నా అభిప్రాయం. మన బిచ్చగాళ్లు పాడే తత్త్వగీతాల్లో ఈ దృష్టి అంతర్భూతమయ్యే ఉన్నది.

''చిల్లరరాళ్ళకు మొక్కుతు ఉంటే చిత్తము చెడునుర ఒరే, ఒరే, చిత్తములోపల చిన్మయజోతిని చూచుచుండుటది సరే, సరే''

''తనకు బొందికి ఏమి తగులాట మాయెనో. వారెవ్వరో గురుడ వీరెవ్వరో!'' మొదలైన గీతాల్లో విచిత్రమైన మర్మదృష్టి ఇమిడే ఉన్నది కాని, ఈ మర్మదృష్టితో ఆధునిక గేయాలు అవిరళంగా సృష్టిగాలేదు. కాకపోగా అనవసరపు కంపతొడుగుగా సుదీర్ఘములై అన్వయక్లిష్టములైన సంస్కృత సమాసాలతో దురవగాహములైన గేయాలు వెలువడ్డాయి. అర్థమైనా కాకపోయినా ఈ గేయాలను మర్మకవితాశాఖ క్రింద చేర్చి మనం కృతకృత్యులం గావచ్చు నేమో!

## ప్రణయ దృష్టి

ప్రణయదృష్టి లేకుండా నవ్యకవితను పరిశీలించడం కష్టమైన పని. హృదయ ధర్మమైన ఆర్ద్రతలోనే ప్రణయభావన పర్యవసిస్తుంది. కాబట్టే హృదయంలోని ఆర్ద్రత కోసం కవులు ఒవేదన పడ్డారు. ''ఎదమెత్తనౌటకై సొదగుందరా, అంత మదిగల అహమ్మెల్ల అణగిపోవునురా'' అన్నారు. మానవత్వాన్ని మరుగుపరిచే అహం అణిగినపుడే జీవితపరమార్థం అందుకోవడానికి వీలౌతుంది. ఈ దృష్టితో బసవరాజు మొదలైనవారు ''ఎదమెత్తినౌటకై సొదగుందరా'' అంటే తరువాతివారు ''నీరవైకాంతసీమ నన్నేడ్వనిందు ఏడ్వనిం డేడ్వ నిం''డని తట్టి లేపే దురుసులోకాన్ని బతిమాలుకున్నారు. ఈ కోవలో విధుర ప్రణయాలు, మధురప్రణయాలు వస్తువులుగా అనేక కావ్యాలు వెలిశాయి. మరికొందరు విశాలదృష్టితో ''శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః'' అని విశ్వమంతా సంతానమన్న భావంగల్గి విశ్వ ప్రణయోపాసకులై 'కడపటి వీడుకోలు' మొదలైన ఖండకావ్యాలు వ్రాశారు. బౌద్ధధర్మాచరణం, దశశీలాచరణం లోకానికి ఉద్బోధించాలని విశ్వప్రణయదృష్టితో వెలువడ్డవే 'సౌందరనందం' 'కరుణశ్రీ' మొదలైన కావ్యాలు. కాని, ఇట్టి కావ్యాలు రచించేటప్పుడు ఉపమాన పరికరాలు, బౌద్ధ వాతావరణసృష్టి బౌద్ధధర్మ పరిభాష తత్తదుచితంగా ఉండటం ఎంతైనా అవసరం. రచయితలు ఆ దృష్టితో కూడా కావ్యరచన చేయడం ముదావహం.

ప్రణయోపాసకుల్లో మరో కోవకు చెందినవారు కూడా ఉన్నారు. వీరిది పరమ రాక్షసప్రకృతి.

''నేనొక భయంకర కాముకుడను,
నాకరాలచితిని కన్నెలు కమిలిపోవుదురు''

ఇట్టి రాక్షస ప్రణయంతో లోకానికి శాశ్వతంగా భయం పుట్టింది.

## అనువాద దృష్టి

ఓ విధంగా ఆంధ్ర సాహిత్యమంతా దాదాపు అనువాద సాహిత్యమే అయినా ఆ అనువాదం మూలవిధేయం కాక స్వతంత్ర పద్ధతిలో నడవడంలో అనువాదకుల ప్రతిభయే ప్రాధాన్యం వహిస్తుంది.

ఆధునిక అనువాద కావ్యాల్లో సంస్కృతం నుండి అనువదించిన వానికంటే ఆంగ్లంనుంచి అనువదించినవే అధికం. అనువాదం కూడా మూలం చదువుకోవలసిన అవసరం లేకుండా స్వచ్ఛంద సుందరంగా ఉండడం అరుదు. కావి అక్కడక్కడ 'పానశాల' వంటి మనోహరమైన అనువాదాలు

కొన్ని లేకపోలేదు. ఈ రచన పారశీకం నుంచి అనువదించింది. ఇంగ్లీషులో కూడా పారశీకం నుండి అనువాదా లున్నాయి. ఒక గ్రంథాన్ని అనువదించేటప్పుడు ఇతర అనువక్తలు కూడా దాని నెట్లా అనువదించారో చూచుకొని తీరాలి. అంతే కాదు. మూల గ్రంథకర్త ప్రభావం ప్రసరించిన ఇతర కవుల రచనలను కూడా చూడడం అవసరం. ఉదాహరణకు ఖయ్యాముతత్త్వం షెల్లీ, కీట్సు మున్నగు వారి మీద కూడా ప్రసరించే ఉన్నది. రామిరెడ్డిగారు ఆయాయీ సాహిత్య సమాలోకనం చేసినవారు గనుకనే ఆ అనుకృతి అంత సుందరంగా ఉన్నది.

గ్రే కవి 'ఎలిజీ'ని చాలమంది అనువదించారు, కాని మూలంలో ఉన్న 'భావ గభీరత' అనువాదంలో వ్యక్తంగా లేదు. ''ఫుల్ మెనీ ఎ జెమ్'' అన్న పద్యానికి ఈ అనుకృతి సమగ్ర సుందరంగా ఉన్నదో లేదో చూడండి.

'అనుపమామూల్యదీప్తరత్నాలు లెన్ని వనధిగర్భాంతరమున గుప్తముగ లేవు?
నవనవామోద రమ్యసూనంబు లెన్ని నిర్జనారణ్యమునఁ బూచి నేలఁబడవు?

– (కీ. శే. గోనుగుంట పున్నయ్య)

''బట్ నాలెడ్జ్ టు దెర్ ఐస్ హర్ యాంపిల్ పేజ్'' అనే పద్యాన్ని అనువదించటం కష్టం.

ఈ నిరుపేదవా రనుభవించి యెఱుంగరు కావ్యగర్భ వి
జ్ఞాన ధనంబు సుంతయు అజస్రము, క్రూర దరిద్రతాతి భా
రానతశీర్షులై తనువు లాకటఁదూల నిసర్గ తీక్ష్ణమే
ధానల మెల్ల నార్చికొని రక్కట కాల హిమాంబు నిర్ఝరిన్.

ఈ అనువాద పద్ధతిలోని ఔచితీ సౌందర్యాలు అర్థం చేసుకొని ఆనందించవలసినవే కాని మాటల్లో ఆట్టే వివరించవలసినవి కావు. గోనుగుంట పున్నయ్య గారి రచనలు లోకానికి సువ్యక్తం గాకముందే ఆయన గతించిపోవడం ఆంధ్రుల దురదృష్టమనే అనాలి.

## అతినవ్యదృష్టి

నవ్యసాహిత్యంలో అతినవ్య సాహిత్యం కొంత వెలువడింది. ముఖ్యంగా పాశ్చాత్య సాహితీ వైవిధ్యం కొంత భారతీయ రచయితల మీద కూడా ప్రసరించడం దీనికి కారణం. పెక్కు మంది రచయితలు ఆంగ్ల పండితులు కూడా కావడంతో, విజ్ఞాన శాస్త్ర పరిచయం కూడా అధికం కావడంతో, అతి నవ్యమైన ఆంధ్రకవితలో విజ్ఞాన శాస్త్ర, సాహిత్యముల కలయిక ఎక్కువగా కనబడుతున్నది. ప్రబంధకవులు 'పరమాణు మధ్య' అయిన నాయిక 'నడుము' అస్తినాస్తి విచికిత్సా హేతువు అనుకుంటే ఊహలో మరోమెట్టెక్కిన కొందరు అసలు నడుము లేనేలేదన్న నిర్ణయానికి వచ్చారు. ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్త అయిన అతినవ్యకవి ఈ గొడవంతా మామూలు కళ్లతో చూస్తే తేలే విషయం గాదని సూక్ష్మదర్శినీ యంత్రంతో పరీక్ష చేయసాగాడట! (ఇది ఒక ఉర్దుకవి గేయంలో భావం)

ఈ అతినవ్యుల దృష్టిని గూర్చి - పాశ్చాత్య రచనలు లక్ష్యంగా - క్రిస్టఫర్ కాడ్వెల్ ఇట్లా అన్నాడు: "Specialisation is useful; Integration is essential, eclecticism which avoids both makes worst of both worlds and is a characteristic feature of modern thought" - 'ప్రతిదానిలోని మంచినీ గ్రహించాలనుకోవడంవల్ల ఏ ఒక్కదాని మంచినీ సమగ్రంగా గ్రహించలేక పోవడం జరుగుతున్న'దని ఆధునిక భావనను గూర్చి కాడ్వెల్ అభిప్రాయ పడ్డారు. ఇటు సాహిత్యదృష్టీ అటు శాస్త్రదృష్టీ రెంటితో సైకాలజీ, ఫిజిక్సు, కెమిస్ట్రీ బయాలజీ - మెటీరియలిజమ్, స్పిరిట్యుయలిజమ్, సర్ రియలిజం - మొదలైన అనేక విషయాలు గ్రహించి వానిని సాహిత్యశాఖలో

పొదిగించాలనే తహతహ రచయితల్లో కలగడంతో సాహిత్యస్వరూపమే మారిపోయి, ఇది జాతీయమైన సాహిత్యమేనా? అన్న అనుమానం కూడా కలిగింది. ఛందోగతిలో కూడా క్రొత్త క్రొత్త సమన్వయం కవితకు విలక్షణదృష్టికూడా కలుగజేసింది. అయినా రచయితలకు భాష మీద వుండే అధికారంకొద్దీ ఆ రచనలు లోకాన్ని ఆకర్షించాయి. ''తాజమహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీ లెవ్వరు?'' అన్నప్పుడు తాజమహలుకు సంబంధించిన మొగలురాణి మనోహర ప్రణయజీవితానికి చిహ్నంగా నిల్చిన అపూర్వ శిల్పం జ్ఞప్తికి రావడంతోపాటు రాళ్ళెత్తిన కూలీల బ్రతుకు లోతులలో వున్న ఆర్థిక తత్త్వం కూడా తలయెత్తక మానదు. అందువల్లనే ఇటువంటి రచనల్లో అటు శృంగారతత్త్వం ఇటు ఆర్థిక అసమానత్వం సమన్వయం చేసి ఫ్రాయిడ్ కూ, మార్క్సుకూ చేతులు కలిపి రచయితలు వారిని కవితలో సుఖాసీనుల్ని చేశా రనిపిస్తుంది. ఇది కేవలం నా అభిప్రాయమే కాదు; ఆ తత్త్వ పరిశీలనం చేసిన పలువురి అభిప్రాయం.

ఇది ఇట్లా ఉండగా భాషా విషయికంగా ఒక క్రొత్త మార్పు తేవాలని చూచా రతినవ్యులు. నన్నయ భట్టు ''భోజనార్థము వరియించు'' అనే అర్థంలో 'క్షణం కృత్వా' అన్న ధాతువును 'క్షణియించు' అని భారతంలోనికి అనువదిస్తే యీ కాలాన్ని బట్టి ఇంగ్లీషు ధాతువుల్ని కూడా 'ఇంచుక్'' ప్రత్యయాలు చేర్చి ఎందుకు తెనుగు చేయరాదు? అని వీరు ప్రశ్నించుకున్నారు. దాని ఫలితంగానే 'టు పెరిష్' అన్న ధాతువు 'ఇంచుక్' ప్రత్యయంతో 'పెరిషించు'గా ప్రత్యక్షమైంది. కాని తర్వాత తర్వాత ఇది అపమార్గమని అనిపించడం వల్లనో ఏమో అటువంటి ప్రయత్నం కవితలో మానేశారు.

భాషా ప్రయోగంలోకూడా 'ఎం చక్కని కల? ఎంచక్కని కల?' అనే దాన్ని 'ఎంత చక్కనికల' అని ఊహించ వలసి రావడం, 'నడవండి నడవండి నామీంచి నడవండి' అన్నచోట నామీదనుంచి అని ఊహ చేయవలసిరావడం - కొంత కష్టమే. ఆ ప్రాంతీయపు పలుకుబడి అర్థంకాకపోతే ఆ మాట ఉచ్చారణ కూడా అర్థంగాదు. కాబట్టి సర్వాంధ్ర సామాన్యమై, అందరికీ సుబోధకంగా ఉండే ప్రమాణ భాషను కవులు సేకరించడం అవసర మనిపించింది. ఇటీవల విద్వాన్ విశ్వం, ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డిగార్ల రచనలు చక్కని ఆంధ్రతాముద్రతో ప్రౌఢ భావభరంలో తెలుగులోకాన్ని మురిపించాయి.

## బృహత్కావ్య దృష్టి

నవ్యాతినవ్య రచన లీవిధంగా క్రొత్త సోయగాలతో బయటికివస్తున్న రోజుల్లో ''రచనలు సమకాలీనములైన కేవల సాంఘిక సమస్యలకోసమే సాగిస్తే వాటికి శాశ్వతత్వం ఎంత వరకు?'' అన్న శంకతో సర్వాధునిక సాహిత్యాన్ని పరిశీలించి, ప్రాచీనములై తెలుగువారికి చిరపరిచితములైన పాత కథలనే క్రొత్త రూపంతో బృహత్కావ్యములుగా రూపొందిస్తున్నారు - విశ్వనాథ, గడియారం, మధునాపంతుల మొదలైన వారు. ఆధునికులలో విశ్వనాథవారి రచనలన్నీ ఒక ఎత్తు తక్కినవారి రచనలన్నీ ఒక ఎత్తు. కవి ఊహ లఘుదృష్టికి అందని దూరదూరాలకు తీసుకొని పోవ సమర్థమైనది. మనం నిత్యం గ్రహములనూ నక్షత్రములనూ చూస్తూనే ఉంటాం, కాని సత్యనారాయణగారు చూచేతీరు వేరు.

**''పరితస్స్ఫూర్యము నేమి త్వరావిధృతి ఫల్గుఫల్గు తారాపథ సా**
**దర మేదుర గమనధురా పురాణచంక్రమణ మొప్ప పోయిరి గ్రహముల్''.**

గ్రహముల గమన వైఖరి ఇందులో వర్ణించారు. కందపద్యమందలి 4, 12 గణాలు జగణాలు (IUI) కావడం గ్రహచంక్రమణం పద్ధతిని సూచిస్తాయి. గ్రహము అటనట చంక్రమణము చేస్తూ, కొంత దూరం వృత్తనేమిక్రమంలో తేలి తేలి పరుగువారుటన్నది 'తారాపథ సాదర మేదుర' అను సమాస సారళ్యం వల్ల సూచితమవుతుంది. అంతే కాక 'పోయెను గ్రహముల్' అని అమహద్వాచకక్రియ

ప్రయోగించుటకు బదులు 'పోయిరి గ్రహముల్' అని మహద్వాచకక్రియా రూపంగా ప్రయోగించడం వల్ల గ్రహముల చైతన్యశక్తి ప్రభావాలు మున్నగునవి ద్యోతకమౌతవి. అసలు కందపద్యగమనమే ఒక దువాళపు తిరుపు వంటిది. ఇట్లా బహుముఖంగా వ్యాఖ్యానించుకోవలసిన శిల్ప సమన్వితపద్యాలు విశ్వనాథవారి కవితలో 'చేయి వేసిన చోటల్లా' తగులుతాయి.

ఒక రకంగా ఈ పై పద్యం సత్యనారాయణగారి కవితాతత్వాన్ని కూడా వివరిస్తుంది. నవ్యాతి నవ్య కవిత్వాలలో విశ్వనాథవారిది ఒక 'పురాణ చంక్రమణం' ఆయన సకలోహ వైభవమూ ఈ పురాణ చంక్రమణముఖంగా వ్యక్త మౌతుంది. కవి మహా వ్యుత్పన్నుడు; ప్రతి భావంతుడు; ఆ విషయం ఉక్తిచమత్కారంతో ఆయనే చెప్పాడు. తాను ''అలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయమూర్తి'' అంతటి ప్రతిభావంతునకు ఆపాటి 'అహం' ఉండడం అవసరమేనేమో! నిజానికి ఆయనవంటివానికి ఉండవలసిన దానికంటే తక్కువగానే ఉన్నదనేవా రున్నారు.

కాని, స్వప్రతిభాదిక విషయంలో ప్రాచీనులు, కవికుల గురువులు అయిన కాళిదాసాదుల అభిప్రాయాలు వేరు.

''మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్ ప్రాంశు లభ్యే ఫలేలోభా దుద్బాహురివ వామనః''

అని కాళిదాసు రఘువంశ ప్రారంభంలో వినీతుడై పల్కాడు. కవియశస్సన్నది చాల దుర్లభమైందనీ అది అందరకూ అందుబాటులో ఉండేది కాదనీ ఆయన తాత్పర్యం. దీర్ఘోన్నత దేహుడైనవాడు అందుకొన వీలైన పండును వామనుడైన తాను అందుకొన ప్రయత్నించడం పరిహాస పాత్రమన్నాడు. దానికేమి? కాళిదాసు అట్లాగే అనవచ్చు. అందరి స్వభావాలు ఒకే విధంగా ఉండాలని నియయం ఏమిటి? తత్వాలు భేదించవచ్చు.

ఈ ఆధునికులలో పౌరాణిక ఇతి వృత్తం నచ్చనివారు చారిత్రక వస్తువు గ్రహించి బృహత్కావ్యాలు వ్రాశారు, వ్రాస్తున్నారు. 'ఆంధ్ర పురాణం' మొదలైన వీ కోవకు చెందినవే! ఇటీవల నెహ్రూ చరిత్ర కూడా కావ్యవస్తువుగా స్వీకరింప బడ్డది. ముదావహమే. ఈ గ్రంథం కవితా దృష్టితో పరిశీలించేవారికి కూడా ఆనందం కలిగించడంవల్ల కవి నిజంగా అభినందనీయుడని నొక్కి చెప్పాలి.

''కవిత్వంలో తత్వదృష్టి ప్రాచీనులైన నన్న యాదులలో లేదా?'' అని ఎవరైనా నిలవేసి ప్రశ్నిస్తే ఇట్లా సమాధానం చెప్పుకోవాలి. ''ఈ తత్వాలలో కొన్ని కాకపోతే కొన్నైనా ప్రాచీనులలో ఉండవచ్చు. కాని, కేవలం జాతీయతా దృష్టితో, కేవలం సాంఘిక దృష్టితో, కేవలం ప్రకృతిపరిశీలన దృష్టితో కవితా వ్యవసాయం సాగించినవారు కారు. వారు మహాకావ్యరచనలో ప్రాసంగికంగా భిన్నతత్వ పరిశీలనం చేయవలసివస్తే ఉచితమైనంతవరకు పరిశీలించారే కాని ఒక్కొక్క తత్వానికి ఒక్కొక్క కావ్యమే వ్రాసినవారు కారు వారు.''

కాని, ఆధునికు లాత్మాశ్రయ దృష్టితో ఏకదేశివృత్తంగా కావ్య రచన సాగించి, ఏకైక భావ సంచాలనం చేసి, లలితసుందరమైన శైలి సాధనంగా ''లిరిక్ పోయిట్రీ''ని అవతరింప చేశారు. కావ్యమంతటా కవి తానే కనిపిస్తుంటాడు. మరికొన్ని ఖండికలలో వర్ణ్యమానమగు వస్తు, పాత్రలకంటే కవే కొట్టవచ్చినట్లు కనిపించడం కూడా కద్దు. కనుకనే ఈ ఇరువదియవ శతాబ్ద రచనలన్నీ సావధానంగా పరిశీలిస్తే ఈ కాలపు కవి జీవితలక్ష్యాలు, వారి బ్రతుకులోతులనుంచి వెలికుబికే ఆశయాదర్శాలు అద్దంలో కనిపించినట్లు కనిపిస్తాయి.

నవ్యకవితలో ఆయాయి తత్వరీతులూ కవితా విన్యాసములూ వెలువరించి, అమూల్య సాహితీ నిక్షేపాన్ని సంతరించిన కవిమిత్రు లందరూ అభినందనీయులు. ★

(30-8-1957 ప్రసంగ వ్యాసం)

# వసంతసేన

మధురవాణి

(పరిశీలనా వ్యాసము)

- వై. కృష్ణకుమారి

క్రీస్తు పూర్వమే ఉజ్జయినీ పాలించిన శూద్రక మహారాజు రసలేఖిని నుండి జాలువారిన అమృతధార 'మృచ్ఛకటికం'. సాంఘిక జీవన విధానంలోని చీకటి కోణాలను దర్శించి, అవగాహన చేసుకొని రచించిన నాటకం ఇది. సామాన్య జన జీవితంలో జరిగే కొన్ని సంఘటనల సమాహారం ఈ నాటకం అనవచ్చును. తానొక మహారాజై ఉండి, రాజభోగాలు అనుభవిస్తూ కూడా, సామాన్యుని జీవితపు నడక, వారి జీవన గతుల లయ ఎట్లాంటిదో ఆలోచించగల సహృదయశీలి శూద్రకుడు. రాజ ప్రాసాదాలలోని బలవంతులు, మూర్ఖులైన కొందరి వ్యక్తుల వలన సామాన్య జనజీవితంలో ఏర్పడే కలతలను స్పష్టంగా చిత్రీకరించగల ద్రష్ట అతను. సంఘంలో జీవించడానికి ప్రతి ఒక్కరికి హక్కు ఉందని గట్టిగా నమ్మిన వాడతను. రాజ పరిపాలన ధర్మయుతంగా లేకపోతే ప్రజలలో రాజకీయ చైతన్యం పెల్లుబికి, తత్ఫలితంగా రాజు పదవీచ్యుతుడు కావడం జరుగుతుందని మృచ్ఛకటికం ద్వారా హెచ్చరించాడు శూద్రకుడు. ఉన్నత పదవిలో ఉన్న వ్యక్తి దుర్మార్గుడయితే అతని చరమ జీవితం విషాదాంతం అవుతుందని, ఏనాటికైనా అతను ప్రజా నిర్ణయానికి తలవంచక తప్పదని ఆనాడె గ్రహించిన మహామనీషి అతను. మృచ్ఛకటికం కన్నా ముందు శూద్రకుడు 'పద్మ ప్రాభృతకము' అని ఇంకొక నాటకాన్ని రచించాడు. అందులో కూడా సమాజంలోని చీకటి కోణాలను వివరిస్తాడు. అయితే వస్తురీత్యా, సన్నివేశ కల్పనల దృష్ట్యా పాత్రఔచితి, పాత్రపోషణ దృష్ట్యా, రసభావాద్యలంకారాల దృష్ట్యా మృచ్ఛకటికం ప్రసిద్ధికెక్కింది. ఈ రెండు నాటకాలను పరిశీలిస్తే శూద్రక మహారాజు ఎంతటి లోకానుభవం కలవాడో, సమాజపు దళిత వర్గాల పట్ల ఎంతటి సానుభూతి ఉందో మనకు అర్థమవుతుంది.

అసలు వేశ్యను నాయికగా చేయడంలోనే అతని సంస్కార హృదయం మనకు అర్థమవుతుంది. పాలకులు తమ భోగాల కంటె పాలితుల క్షేమాన్ని గురించి ఆలోచిస్తారన్నది, అటువంటి వారే చరిత్రలో పుణ్యమూర్తులుగా నిలబడతారన్నది చరిత్ర చెబుతున్న సత్యం. అటువంటి పుణ్యమూర్తులలో అగ్రేసరుడు శూద్రక మహారాజు. సామాన్య ప్రజలలో వ్యాప్తిలో ఉన్న ఆచార వ్యవహారాల గురించి ఇతను తన నాటకంలో చెబుతారు. ఉదా: మొదటి అంకంలో విటుడు వసంతసేనతో ''నీవిక పడవలాగా, లతలాగా, బావిలాగా ఉండాల్సిన దానివి. నీకంటూ ఒక ఎన్నిక ఉండరాదు. అదే నీ వృత్తినీతి'' అంటాడు. అప్పటికే వేశ్యావృత్తి పై అర్థంలో స్థిరపడిందన్నమాట. రెండో అంకంలో ''బ్రాహ్మణుడిని పూజచేసి వెళ్ళమను. ఈరోజు నాకు పూజ చేయాలని లేదు'' అంటుంది వసంతసేన తన చెలికత్తెతో. అంటే ఆ కాలంలో వేశ్యల ఇంటికి బ్రాహ్మణుడు పూజానిమిత్తమై రోజూ వెళ్ళేవారన్నమాట. అది ఆనాడొక సంప్రదాయం అని తెలుస్తోంది. ఇట్లా ఎన్నో సన్నివేశాలలో శూద్రకుని సమాజ పరిశీలనా దృష్టి కన్పిస్తుంది. అంతటి అవగాహన ఉంది కాబట్టే ఆలేఖిని నుంచి వచ్చిన ఈ కళాఖండం ఇప్పటికీ తన విలువను చాటుకుంటూనే ఉంది.

వీరేశలింగం యుగాంతరంలో నవ్యాంధ్రోదయంలో వెలుగు రేకగా కన్పించిన కన్యాశుల్క నాటకం విరివిలోను, వైవిధ్యంలోనూ దానికదే సాటి. "To arouse Public opinion on the subject by exposing the evil in a popular Drama" అనే ప్రథమ ప్రయోజనం సిద్ధింప చేసుకుందీ నాటకం. లలిత హాస్యభరితమైన సంభాషణ ద్వారా సంఘానికి మెత్తటి వాతలు పెట్టాడు కవి. ఇందులోని ఇతివృత్తపు వాస్తవికతయే ఈ నాటకాన్ని అజరామరం చేసింది. ఒకరకంగా తెలుగు నాటకరంగానికి తిరిగి ప్రాణప్రతిష్ఠ చేసింది అని కూడా చెప్పవచ్చును. ప్రాచీన సాహిత్యంలో ఒక 'మృచ్ఛకటికం' నాటకం తప్ప దీనితో సరితూగే నాటకంలేదని విజ్ఞుల అభిప్రాయం. నిజానికి మధురవాణి పాత్రమీద వసంతసేన పాత్ర ప్రభావం కొంత ఉందని విమర్శకులు అంగీకరించిన విషయమే. అయితే ఈ రెండు పాత్రలు ఏ సందర్భాలలో ఒకే రకంగా ప్రవర్తించాయి, ఎక్కడ విభేదించాయి అని వివరించటమే ఈ వ్యాసం ఉద్దేశ్యం.

వసంతసేన ఉజ్జయిని నగరానికి వన్నెతెచ్చిన వేశ్యశిఖామణి. నృత్యగానాలలో ఆరితేరిన కళావంతురాలు. అట్లాగని అహంకారి కాదు. పైగా దయాగుణం కలది. జూదరియైన సంవాహకుని కష్టసమయంలో ఆదుకొని, ధన సహాయం చేస్తుంది. సంవాహకుడు జూదంలో ఓడిపోయి, సాటి వారిలో అవమానితుడై, పారిపోతూ వసంతసేన ఇంట దూరుతాడు. విషయం తెలుసుకున్న వసంతసేన అతనితో "నీకు భయము ధనికుల వలనా! అయినచో నీకేమి ఫరవాలేదు" అంటుంది. ఈ పలుకులు ఆమె ధనాతిశయమును తెల్పుతాయి. తానాశ్రయమిచ్చిన వ్యక్తికి ఎవరి వలన భయమో తెలిసిననూ, వారి స్థితిగతులకు విలువ నివ్వక, ఆశ్రితులకు సహాయం చేసే ఆమె గుణం ఇక్కడ మరింత స్పష్టమవుతుంది. సంవాహకుని ఆమె ఆదుకొని ఋణ విముక్తుని చేయడమే గాకుండా, వానిని ముక్తిపథం వైపుకు నడిపించింది. ఈ సహాయపడే గుణమే మధురవాణిలో మారాకు తొడిగింది. "వృత్తిచేత వేశ్యని గనుక చెయ్యవలసిన చోట్ల ద్రవ్యాకర్షణ చేస్తాను గాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్న అని తలిచారా! మీ తోడబుట్టుకు ప్రమాదం వచ్చినప్పుడు నేను డబ్బుకి ఆశిస్తానా!" అన్న మాటల్లో ఆమె నిర్మలత, ఆర్ద్రహృదయం అవగతమవుతుంది. కరటకశాస్త్రి తన అవసరానికి మధురవాణిని పొగడుతూ ఆమె కళింగ రాజ్యానికె వన్నె తెచ్చింది అంటాడు. అయితే వన్నె సంగతి ఎట్లా ఉన్నా మధురవాణి పాత్రవల్లె వేశ్యల గుండె లోతులలోని మమతానురాగాలు వెల్లులోకి వచ్చాయనవచ్చును. మొదట్లో మామూలు సానిలా కన్పించినా, అవసరం వచ్చినపుడు ఎంతో సానుభూతితో, తన శక్తికి మించిన సహాయం చేసిన మానవతామూర్తి మధురవాణి.

రాచరికం బలంగా ఉన్న ఆ రోజులలో శకారుడి లాంటి నీచుడిని తిరస్కరించడానికి ధైర్యం కావాలి. "ఆర్య చారుదత్తుని నేను అనుసరిస్తున్నానని లోకులు అనుకుంటె అది నాకు గౌరవప్రదమైంది." అంటుంది ఆమె. "తన మనస్సును పోలిన వారిని ప్రేమిస్తే ఆ ప్రేమ శోభిస్తుంది. అదీగాక సహకార వృక్షాన్ని వదిలి మోదుగు చెట్టును ఎందుకు ప్రేమిస్తాను?" అని శకారునితో తన ప్రేమ నిర్భయంగా ప్రకటిస్తుంది. పైగా నీవు ప్రేమిస్తున్నది ఒక దరిద్ర చారుదత్తుడిని అని శకారుడు హేళన చేస్తే "నీవన్న ఆ మాట నాకు ఎంతో శోభనిచ్చింది" అంటుంది సంతోషంగా. ఈ విషయంలో వసంతసేన తన తల్లి మాటలను కూడా త్రోసిపుచ్చింది. "అలంకరింపబడిన బండి వచ్చింది, దానిని ఎక్కి పొమ్మను" అన్న తల్లిమాటలను రెండో ఆలోచన లేకుండా తిరస్కరించింది వసంతసేన. పైగా "ఆ బండి చారుదత్తునిది కాదు కదా! పొమ్మను! నేను బ్రతికి ఉండాలంటే మళ్ళీ

ఇట్లాంటి ఆజ్ఞ ఇవ్వవద్దని చెప్పు'' అని తన చెలికత్తెతో అంటుంది. వసంతసేనలోని ఈ గుణం మధుర వాణిలో మరొక్క రకంగా విప్పారింది. పంతులు చాటు మనిషే అయినా అతను చేస్తున్న అన్యాయాలను పరోక్షంగా అడ్డుకుంటుంది. ఇక్కడ ఆమెకు ధైర్యంతోపాటు సమయస్ఫూర్తి, చాకచక్యం కూడా కలిసివచ్చాయి. చివరికి పంతులినే అతని ఇంటి బయట నిలబెట్టగలిగే సమయం కలిసి వచ్చింది మధురవాణికి. ఆ సందర్భంలో పంతులు కూడా మధురవాణిని ఏమి చేయలేకపోయాడు. పైగా మొహం చెల్లక ఊరిబయటకు ఎదో మిషచేత తప్పించుకుంటాడు.

హాస్యప్రియత్వము ఇద్దరిలో పుష్కలంగా ఉంది. రత్నావళిని తెచ్చి ఇచ్చిన విదూషకుడు తన యజమాని గురించి చెబుతూ అతడు జూదంలో వసంతసేన నగను ఓడిపోయాడని అబద్దం చెప్తాడు. అయితే నిజం తెలిసిన వసంతసేన ఆ విషయాన్ని దాచిపెట్టి అతనితో ''ఆ జూదరిని కలవడానికి సాయంత్రం నేను వస్తానని చెప్పు'' అంటుంది. ఈ సందర్భంలో వసంతసేన మాటలలో సున్నితమైన హాస్యం వెల్లివిరుస్తున్నది - ఇక మధురవాణి అయితే అడుగడుగునా హాస్యం చిందిస్తూనే ఉంటుంది. తనని ఇంట్లోంచి లేపుకొచ్చిన పంతులిని పెళ్ళాడమని మీనాక్షి నిర్బంధిస్తున్న సందర్భంలో ఇంటిలోపలి నుంచి మధురవాణి ''పెళ్ళాడకపోతే నువ్వు మాత్రం వూరుకుంటావూ? దావా తెస్తావు. పంతులు గారికి దావాలంటె సరదాలే'' అంటూ అంత సీరియస్ సన్నివేశంలో కూడా మనల్ని నవ్విస్తుంది. పైగా ''నిలబడండి. కర్పూరం వెలిగించి మంగళహారతి తెస్తాను'' అనడంలో హాస్యం మరింత ఉత్కృష్టమవుతుంది. కన్యాశుల్కం నిండా ఇట్లాంటి హాస్య సంభాషణలు ఎన్నో.

గృహస్థ జీవితాన్ని వసంతసేన ఎంతగానో కాంక్షించింది, చివరికి దానిని సంపాయించింది. చారుదత్తుడు మృత్యుముఖంలోకి వెళ్లడానికి, తిరిగి రావడానికి కూడా కారణమైన వసంతసేనను నాటకం చివరిలో అతని ధర్మపత్ని ధూతాంబ తన చెల్లెలుగా సమాశ్వాసించింది. ''నా చెల్లెలు కుశలమా'' అని పలకరిస్తుందామె వసంతసేనను. ''ఇప్పుడు నాకు కుశలం కల్గింది'' అంటుంది వసంతసేన ఎంతో తృప్తిగా. ఇంతలో అక్కడకు వచ్చిన శర్విలకుడు రాజాజ్ఞ అంటూ వసంతసేన శిరస్సు మీద మేలి ముసుగువేసి ''రాజుగారు నీకు వధూశబ్దాన్ని ఇచ్చి అనుగ్రహించారు.'' అంటాడు. అంటె ఆమె ఇప్పుడు న్యాయబద్ధమైన గృహపత్ని అని అర్థం. ఆమెను కులస్త్రీగా ఆనాటి సంఘం కూడా ఆమోదించింది అని అర్థమవుతున్నది. కాని ఈ విషయంలో మధురవాణి కోరిక ఫలించలేదనే చెప్పవచ్చును. కరటకశాస్త్రి మధురవాణిని వేశ్య శిఖామణి అని పొగడుతున్న సందర్భంలో ''అంతకన్నా కాపు మనిషినై పుట్టి - మొగుడి పొలంలో వంగ మొక్కలకూ మిరప మొక్కలకూ దోహదం చేస్తే యావజ్జీవం కాపాడే తన వాళ్ళున్న వారు వుందురేమో'' అన్న మాటలలో మధురవాణి కోరిక స్పష్టమవుతుంది. అయితే ఆనాటి సంఘ వ్యవస్థ అధః పాతాళంలో ఉన్న కారణంగా మధురవాణి కోరిక తీర లేదు.

మధురవాణి.వసంతసేనల పాత్ర మధ్య కొద్దిగా తేడాలు కూడా ఉన్నాయి.

వసంతసేన ఏకచారిణి. అంటే మనసా వాచా కర్మణా కూడా ఒకే వ్యక్తిని నమ్మి, అతనితో ఉండటం. కాని మధురవాణికి ఆ అవకాశం లేదు. అయితే నాటకంలో అధికభాగం రామప్పపంతులుతోనే ఉన్నట్లు కన్పిస్తూంది.

వసంతసేన చాలా ఐశ్వర్యవతి. ఆమె భవనాన్ని, ఆమె వైభవాన్ని చాలా వివరంగా, గొప్పగా వర్ణిస్తాడు శూద్రకుడు, కాని మధురవాణి అట్లాకాదు. ఆమె ఐశ్వర్యమంతా ఆమె తెలివి తేటలే. ఆర్థికంగా ఉన్నత స్థితిలో ఉన్నట్లు కన్పించదు.

వసంతసేన చారుదత్తుడిని నమ్మినందుకు అతడామెను ఆదరించాడు: నిజంగా ప్రేమించాడు. గిరీశంగాని, రామప్పపంతులుగాని మధురవాణిని 100% ఎన్నడూ ప్రేమించలేదు. రామప్పపంతులు అయితే మధురవాణిని ఎన్నోసార్లు ప్రత్యక్షంగా, పరోక్షంగా పరీక్షించాడు కూడా. మధురవాణి పట్ల ఇతనికి పూర్తి నమ్మకం లేదనే చెప్పాలి.

మధురవాణికి ఆత్మవిశ్వాసం చాలా ఎక్కువ. కన్యాశుల్కంలో మనకీ విషయం ఎన్నోసార్లు స్పష్టమవుతుంది. కాని వసంతసేన బేలగా దర్శనమిస్తుంది.

వేశ్యను నాయికగా చేయడమనేది ఈ రెండు నాటకాలలో సమాన అంశం. వేశ్య నాయికగా గల నాటకాన్ని సంస్కృతంలో 'ప్రకరణము' అంటారు. ఇది రూపక భేదంగా అలంకార శాస్త్రంలో ఉంది గాని ఒక్క మృచ్ఛకటికం తప్ప ఇంకోటి మనకు ఈ విషయమై కన్పించదు. ఈ ఆలోచనాధారం చేసుకొనే గురజాడవారు మధురవాణిని సృష్టించారు. మధురవాణి లేని కన్యాశుల్కాన్ని మనం ఊహించలేము. అంతగా నాటకంలో ప్రాణభూతమై పోయిందామె.

వసంతసేన చివరికి గృహిణీత్వాన్ని పొంది తన కోరిక తీర్చుకొని, జీవితాన్ని ధన్యం చేసుకుంది. కాని మధురవాణికి ఆ అవకాశం కల్గలేదు. ''పెళ్ళి చేసుకోగోరిన వేశ్యలకు కోరతగిన వరులు దొరకటం ఎలాగండి?'' అని సౌజన్యారావును సూటిగ ప్రశ్నిస్తుంది మధురవాణి. అయితే ఈ ప్రశ్నకు గురజాడవారు సమాధానం ఏ పాత్రతోనూ చెప్పించలేదు. అయినా ఈ ప్రశ్నకు గురజాడ వారే కాదు, ఎవరూ కూడా సమాధానం చెప్పలేరు. ఎందుకంటే మన సమాజం, మనుషుల మనస్తత్వం ఇంకా ఆ స్థాయికి ఎదగలేదు కాబట్టి; మధురవాణి అన్నట్లు ''ఉపదేశం లావు, ఆచరణ తక్కువ'' కాబట్టి.

వసంతసేన లాంటి మనిషి కవుల కల్పనలో తప్ప నిజజీవితంలో ఉండదని సౌజన్యారావు పంతులి నోట అన్పించి, వసంత సేన నొక ఆదర్శపాత్రగా చిత్రీకరించాడు గురజాడ. తాను సృష్టించిన మధురవాణి కూడా అంత ఉదాత్తమైనదే అన్న భావన అప్పారావుగారికి ఉన్నట్లుంది. లేకపోతే లోకమంతా మెచ్చుకున్న సౌజన్యారావు పంతులు కూడా చివరికి మధురవాణి కోసం వ్రతభంగం చేసుకోవడానికి సిద్ధపడ్డాడు. అయితే చివరివరకు విషయాన్ని లాగిన మధురవాణి ఆయనను ఆయన స్థానంలోనే నిల్పింది. తాను అంతకన్నా ఎన్నో రెట్లు పైస్థాయిలో నిలిచింది. తనని తానుగా నిల్పిన మధురవాణికి సౌజన్యారావు ఇంకేమీ ప్రత్యుపకారం చేయలేక, సత్పురుషుడైన కృష్ణుని స్నేహాన్ని - అదే భగవద్గీతను ఇచ్చాడు.

ప్రాచీన సాహిత్యంతో పరిచయం ఉంటే తప్ప వసంతసేన పాత్ర మనకు పూర్తిగా అవగాహన కాదు. కాని పండిత పామరుల నందరిని సమానంగా అలవరించి, ఆనందింప చేసి, వారి మనస్సులలో శాశ్వత ముద్ర వేసుకున్న మధురవాణిని ఏ కొలబద్దతో కొలుస్తాం? తన పేరంత మధురంగా ఉన్న మధురవాణిని, అంత గొప్ప పాత్ర సృష్టించిన గురజాడ వారిని తెలుగుజాతి ఉన్నంతకాలం - కొంచెం సంస్కృతీకరించి చెప్పాలంటె ఆచంద్రతారార్కం - మదిలో నిల్పుకుంటుంది అన్నది నగ్న సత్యం. ★

సమీక్ష:

# ప్రేమించడం ఒక కళ

**Art of Loving**
**By ERICH FROMM**

- అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

అరిస్టాటిల్ ప్రతిపాదించిన ఈ తార్కికన్యాయం ఆలోచన అలవాట్లలో జీర్ణించుకు పోయింది. ఆ తరవాత అది ''సహజ'' మని, స్వయం సిద్ధమని భావించబడింది. "X" అనేది 'A', 'non-A' లు - రెండు అవుతుంది'' అనే వాక్యం అర్థరహితమని భావించబడింది. (ఈవాక్యం 'X' అనే కర్తకు దత్తకాలంలో చెందుతుందే కాని, ఇప్పటి 'X' కో లేక తరువాతి 'X'కో, లేక 'X' యొక్క ఒక అంశానికి కాక మరొక అంశానికో చెందదు).

ఈ అరిస్టాటిల్ తర్కానికి వ్యతిరేకంగా విరోధాభాస (paradoxical) మని పిలవదగిన తర్కమొకటి ఉంది. ఇది 'A', 'non-A', లు - రెండు 'X' కు విధేయాలుగ పరస్పరాపవర్జకాలు (exclude) కావు అని చెబుతుంది. ఒక వస్తువుకు ఒక గుణము, తద్వ్యతిరేక గుణమూ - రెండూ ఉంటాయని చెప్పడము - విరోధాభాస తర్కం భారత చైనా ఆలోచనా విధానాల్లోను, హిరాక్లిటస్ దర్శనంలోను, మళ్ళీ తిరిగి ద్వంద్వ తర్కం లేదా గతితర్కం (dialectics) అనే పేరుతో హెగెల్, మార్క్స్ దర్శనాలలోను ప్రబలంగా కనిపించింది. విరోధా భాస సామాన్య సూత్రాలను లావొ - త్సే (Lao-tse) స్పష్టంగా చెప్పాడు. ''కచ్చితంగా నిజమైన మాటలు విరోధాభాసమైనట్లు కనిపిస్తాయి. చు-అంగ్-చు (Chuangtzu) ఇలా అన్నాడు: ''ఒకటి అయినదీ ఒకటే. ఒకటే కానిదీ ఒకటే'' విరోధాభాసం యొక్క ఈ సూత్రాలు విధ్యాత్మకాలు: **అది ఉంది,** లేదు. మరొక సూత్రం నిషేధాత్మకము; **ఇది ఇదీ కాదు అదీ కాదు.** మొదటి ఆలోచనా సూత్రం మనకు టావోదర్శనంలోను, హిరాక్లిటస్ లోను, మళ్ళీ తిరిగి హెగెల్ గతి తర్కంలోను కనిపిస్తుంది. రెండవ సూత్రం భారతీయ దర్శనాలలో కనిపిస్తుంది.

అరిస్టాటిల్ తర్కం, విరోధాభాస తర్కం - ఈ రెండింటి మధ్య భేదాన్ని విపులంగా వివరించాలంటే ఈ గ్రంథ పరిధి అనుమతించనప్పటికీ, విషయాన్ని అర్థం చేసుకోవడం కోసం కొన్ని దృష్టాంతాలను ఇస్తాను. మొట్టమొదటగ, పాశ్చాత్య ఆలోచనా విధానంలో, విరోధాభాస తర్కం దార్శనికంగా అభివ్యక్తమైంది హిరాక్లిటస్ తత్త్వంలో. అసలు సత్యాని (ఉనికి - existence) ) కి మూలం విరుద్ధ విషయాల మధ్య ఘర్షణ అని అతడు భావించాడు. వీణ, బాణాలలోని ఘర్షిస్తున్న సామరస్యం (conflicting harmony) లాగ, సర్వం - ఏకం (అంతా - ఒకటే All-one) అనేది లోలోపల ఘర్షించుకొంటూనే తనలో తాను ఐక్యమవుతుం దని వారు అర్థం చేసుకోరు,'' అని అతడు అన్నాడు. ఇంక అంతకంటె స్పష్టంగా చెప్పాలంటే: ''మనం కాలిడేది అదే నదిలోకి అయినా అదే నదిలోకి కాదు; అది మనమే, అది మనం కాదు. నది ఎప్పుడూ ప్రవహిస్తుంటుంది కనుక అదే నీటిలోకి మనం రెండుసార్లు కాలిడలేము. కాలుతీసి కాలు వేసేటప్పటికి నీరు మారిపోతుంది. కనుక మనం దిగేది అదే

నది అయినా ఆ నది కాకుండపోతుంది. అలాగే క్షణ క్షణమూ మన వయస్సు పెరుగుతుం టుంది. మనం మారిపోతుంటాము. ఇలా వయస్సు పెరిగినా, మనం మారినా, మనలను మనంగానే గుర్తిస్తున్నాము. అందుకని మనం మనమే, మనం మనం కాదు. లేదా ఒకటే అనేకంగా, సజీవంగా, నిర్జీవంగా, నిధాళువుగా, నిర్నిధాళువుగా, చిన్నగా, పెద్దగా తనంత టదే అభివ్యక్తమవుతుంది.''

లావొత్సే తన దర్శనంలో, అదే విషయం కవిత్వంలో చెప్పాడు. టావో విరోధాభాస ఆలోచనకు ఒక సహజమైన ఉదాహరణ ఈ దిగువ వాక్యము: ''గురుత్వాకర్షణ తేలికదనానికి మూలం; చలనాన్ని నిశ్చలత ఏలుతుంది.'' లేదా ''టావో తన క్రమగతిలో ఏమీ చేయడు, అందువలన అతడు చేయనిదంటూ ఏమీ లేదు.'' లేదా ''నా పలుకులను అర్థం చేసుకోవడం తేలిక, ఆచరించడం తేలిక; కాని ప్రపంచంలో వాటిని తెలుసుకోగలిగినవాడు, ఆచరించే సామర్థ్యం గలవాడు ఒకడూ లేడు.'' భారతీయ, సోక్రటీజ్ దర్శనాలలోవలె టావో దర్శనం గూడ, జ్ఞానం ద్వారా మనం చేరగలిగిన అత్యున్నత స్థితి మనకు ఏమీ తెలియదని తెలుసుకోవడము. ''తెలుసుకోవడం: తెలియదని తెలుసుకోవడం అన్నిటికంటె ఉత్తమమై నది (అవాప్తి attainment); తెరియకపోయినా తెలుసనుకోవడం రుగ్మత (disease)" ఈ దర్శనం ఫలితంగానే పరమ దేవునికి పేరు పెట్టడానికి వీలులేకపోయింది. పారమార్థిక సత్యం, పరమైనది. మాటకు, ఆలోచనకు చిక్కదు. లావో-త్సే చెప్పినట్లు గమ్యమానపథం మారని ఆయత (endurıng) పథం కాదు. అభిధేయనామం మారని ఆయతనామం కాదు'' లేదా ఇంకొక సూత్రీకరణ ప్రకారం, ''దానిని చూస్తాము, చూడము. దానికి 'సమవృత్తి' (equable) అని పేరు పెడతాము. దానిని వింటాము, వినము. దానికి 'అశ్రావ్య' (inaudible) మని పేరు పెడతాము. మనం పట్టుకోజూస్తాము, పట్టుకు దొరకదు. దానికి 'అతిసూక్ష్మం' (నిరవయవం the subtle) అని పేరు పెడతాము. ఈ మూడు గుణాల మూలాన దానిని వర్ణించ వీలులేదు; అందువలన వాటిని మేళవించి, ''ఆ ఒకటి'' (The One) ని సాధిస్తాము.'' అదే భావాన్ని వ్యక్తీకరించిన మరొక సూత్రము: (టావోను గురించి) తెలిసిన వాడు (దానిని గురించి) మాట్లాడడు (మాట్లాడలక్ష్య పెట్టడు); దానిని గురించి ఎవరైన మాట్లాడితే (అలా సిద్ధపడితే) వారికి అది తెలియదు.''

బ్రాహ్మణమతంలో అనేకత్వానికి (గోచర సంబంధమైన) ఏకత్వానికి (బ్రహ్మన్) మధ్య సంబంధం చర్చించబడుతుంది. కాని ఇండియాలో గాని, చైనాలో గాని, విరోధాభాసతత్వాన్ని ద్వైత దృక్పథంతో (dualistic-stand) కలగాపులగం చేయడం లేదు. సమమేళనం (Harmony) తను జనించిన ఘర్షణలో ఉంటుంది. ''బ్రాహ్మణ సిద్ధాంతం మొదటి నుంచి ఏకకాలిక విరుద్ధాల (Simultaneous antagonisms) ను, గోచర ప్రపంచంలో వ్యక్తమైన శక్తులను, రూపాలను గుర్తించడానికి ప్రాముఖ్యమిచ్చింది.'' ఈ విశ్వంలోను, మనలో గూడ అంతిమ శక్తి (ultimate power) భావ, ఇంద్రియ పరిధులను రెండింటిని అధిగమిస్తుంది. అందువలన అది ''ఇది కాదు, ఇలాకాదు''. కాని జిమర్ చెప్పినట్లు, ''ఈ నిర్దిష్ట అద్వైత సిద్ధిలో వాస్తవా వాస్తవాల మధ్య వైరుధ్యం లేదు.'' అనేకత్వంలో ఏకత్వాన్ని వెదికినప్పుడు, ఈ గోచర ప్రపంచంలో మనకు కనిపించే వైరుధ్యం వస్తు స్వభావాన్ని కాక, వాటిని దర్శించే మనస్సు స్వభావాన్ని తెలియజేస్తుందనే నిర్ణయానికి వచ్చారు బ్రాహ్మణ దార్శనికులు. వాస్తవాన్ని గ్రహించాలంటే, దర్శించే మనస్సు తనను తాను అధిగమించాలి. వైరుధ్యం అనేది మానవ

మనోస్థితే (category) గాని వాస్తవానికి సంబంధించిన మూలకం (భాగం) కాదు. ఋగ్వేదంలో ఈ సూత్రం ఈవిధంగా చెప్పబడింది: ''నేనే ఆ రెండు - జీవశక్తి, జీవ పదార్థమూ, రెండూ ఒకేమాటుగ.'' ఆలోచన అనేది విరోధాల ద్వారానే సాధ్యమవుతుంది. దీనికి వారసత్వం మనకు వేదాంత దర్శనంలో కనిపిస్తుంది. వేదాంత ప్రతిపాదన ఇలా ఉంటుంది: ''సున్నితమైన భేదాలతో సహా ఆలోచన అనేది అజ్ఞతకు సూక్ష్మ దిక్చక్రం మాత్రమే, వాస్తవానికి మాయ మనలను వంచించడానికి పన్నే పన్నుగడలలో కెల్ల అది అతి సూక్ష్మమైంది.''

విరోధాభాస తర్క ప్రభావం దైవభావనను ఎంతగానో మార్చింది. దేవుడు పరమసత్యాన్ని ప్రతిబింబించినంతవరకు, మానవుని మనస్సు ఆ సత్యాన్ని విరోధాల ద్వారా ప్రత్యక్షం చేసుకొన్నంతవరకు, దేవుని గురించి ఇదమిత్థంగా ఏమీ చెప్పలేము. వేదాంతంలో సర్వశక్తి మంతుడు, సర్వజ్ఞుడు అనే దైవభావన అజ్ఞానానికి అంతిమ రూపంగా పరిగణించబడింది. ఇక్కడ మనం టావో (మార్గం) నామరహితత్వంతో మోజెస్‌కు సాక్షాత్కారమైన నామరహిత నాముడైన దేవునితో, మెయిస్టర్ ఇకార్ట్ ''కేవల శూన్యం'' (absolute nothing) తో సంబంధాన్ని చూస్తాము. మానవుడు అభావాన్ని (Negation) మాత్రమే తెలుసుకోగలడు, పరమసత్యాన్ని తెలుసుకోలేడు. ''ఈలోపల దేవుడు ఏది కాదో బాగా తెలిసినప్పటికీ, దేవుడు ఏమిటోమాత్రం తెలుసుకోలేడు మానవుడు... ఈవిధంగా శూన్యంతో తృప్తిపడిన మనస్సు అన్నిటికంటె అత్యంతమైన మంచికోసం ఆక్రోశిస్తుంది.'' మెయిస్టర్ ఇకార్ట్‌కు, ''దేవుడు అభావాలకు అభావము, నిషేధాలకు నిషేధము... ప్రతిజాతిలోను ఒక ప్రతిషేధార్థముంది. ప్రతిదీ తను మరొకటి కాదంటుంది.'' పరమార్థికసత్యం కబలాకు (Kabalah) అనంతమైనట్లు గానే "En Sof" అయినట్లుగానే, దీని తదనంతర ఫలితంగా మెయిస్టర్ ఇకార్ట్‌కు దేవుడు ''కేవల శూన్యం'' అవుతున్నాడు.

దైవప్రేమ భావనలోని ఒక ముఖ్యమైన తేడాకు భూమికను తయారుచేయడం కోసం నేను అరిస్టాటిల్ తర్కం విరోధాభాస తర్కాల మధ్య భేదాన్ని చర్చిస్తున్నాను. మానవుడు సత్యాన్ని వైరుధ్యాలలో మాత్రమే దర్శించగలడని, ఆలోచనల ద్వారా, దానిని, ఆ పరమ సత్యాన్ని ఆ 'ఒకటి'ని ఎప్పుడూ చేరలేడని, విరోధాభాస తర్కాచార్యులు సెలవిస్తారు. ఈవిధంగా ఆలోచన ద్వారా పరిష్కారాన్ని సాధించాలని ఎవరూ అనుకోలేదు. అంతిమ పరిష్కారాన్ని ఇవ్వలేని జ్ఞానానికి మాత్రమే ఆలోచన మనలను చేరుస్తుంది. ఆలోచనాప్ర పంచం ఎప్పుడు విరోధాభాసలో చిక్కుకొని ఉంటుంది. పారమార్థికంగా ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి మార్గం ఆలోచనలో కాక, కర్మలో ఉంది; ఏకతా (Oneness) నుభవంలో ఉంది. దైవప్రేమ అంటే ఆలోచన ద్వారా దేవుని చేరుకోవడం కాదు; దైవప్రేమ మీద తనకున్న ఆలోచనలు గూడ కావు; దేవుడు అనుభవ వేద్యం - అనే సత్యానికి విరోధాభాస తర్కం దారితీస్తుంది.

ఇది సజ్జీవనానికి ప్రాముఖ్యతనిస్తుంది. మొత్తం జీవితంలో ప్రతి చిన్న పెద్ద పని గూడ దివ్యజ్ఞానానికి అర్పితమవుతుంది; కాని ఆ దివ్యజ్ఞానం సదాలోచన ద్వారాకాక సత్కార్మ నుంచి వచ్చినదై ఉండాలి. ఇది ప్రాచ్యమతాలలో స్పష్టంగా కనిపిస్తుంది. బ్రాహ్మమతంలో, బౌద్ధం, టావోలకు వలె, మతలక్ష్యం సద్విశ్వాసం (Right belief) కాక, సత్కార్మ. యూదీయ మతంలోను మనకు ఇదే ప్రముఖంగా కనిపిస్తుంది. యూదుల ఆచారంలో విశ్వాసానికి సంబంధించిన మతవిభేదం ఎప్పుడు లేదు. (దీనికి ఉన్న ఒక సాపవాదము; పారశీలకు,

సద్యూసీల (Sadducees) కు ఉన్న భేదం, ముఖ్యంగా సాంఘిక వర్గాల మధ్య ఉన్న భేదం) యూదీయ మతం, ముఖ్యంగా ఈ శకారంభం నుంచి, సన్మార్గంలో అంటే హలాక్ (Halach = నడచుట; ఈ పదానికి సరిగా టావోకు ఉన్న అర్థమే ఉంది.) నడవడానికి ప్రాముఖ్యతనిస్తుంది.

ఆధునిక చరిత్రలో ఇదే సూత్రాన్ని స్పినోజా, మార్క్స్, ఫ్రాయిడ్ చెప్పారు; స్పినోజా దర్శనంలో సద్విశ్వాసం కంటె సత్ప్రవర్తన ప్రాముఖ్యత వహించింది. అదే విషయాన్ని మార్క్స్, "దార్శనికులు ప్రపంచానికి వివిధంగా అర్థం చెప్పారు. అసలుప్రశ్న దానిని మార్చడము" అనే వాక్యం ద్వారా చెప్పాడు. ఫ్రాయిడ్ విరోధాభాసతర్కం మనోవిశ్లేషణ చికిత్సకు తన అంతరంగంలోకి తాను తొంగి చూసుకోవడం - దారితీసింది.

విరోధాభాస తర్క దృష్టిలో ఆలోచన కాక, కర్మ ముఖ్యమవుతుంది. ఈ దృక్పథం నుంచి అనేక ఇతర ఫలితాలు నిష్పన్నమవుతాయి. మొట్టమొదట అది భారతీయ, చైనీయ మతాలలో సహనాని (tolerance) కి దారితీసింది. సదాలోచన (Right thinking) అంతిమసత్యం కానప్పుడు, అది ముఖ్యమార్గం కానప్పుడు, పరసిద్ధాంతాలకు దారితీసిన ఇతరుల ఆలోచనలతో తగవు పడవలసిన అవసరమేమీ లేదు. అంధకారంలో ఏనుగును తాకిచూచి వర్ణించిన కథ ఈ సహనాన్ని చక్కగా వ్యక్తం చేస్తుంది. దాని తొండం పట్టుకున్న ఒకడు, "ఈ జంతువు నీటిగొట్టం వలె ఉన్నది"న్నాడు; చెవినితాకిన మరొకడు "ఈ జంతువు ఒక పెద్ద విసనకర్ర" అన్నాడు; మూడవవాడు కాళ్ళను తాకి ఆ జంతువును స్తంభంగా వర్ణించాడు.

రెండవ విషయం, విరోధాభాస దృక్పథం, ఒక ప్రక్క రూఢ విశ్వాసం (dogma) కంటె, మరొకప్రక్క విజ్ఞానశాస్త్రాన్ని (science) వృద్ధి చేయడం కంటె, మానవుని మార్చడానికి ప్రాముఖ్యతనిచ్చింది. భారతీయ, చైనీయ, మార్మిక దృక్పథాల ప్రకారం మనిషి చేయవలసింది సరిగా ఆలోచించడం కాదు, సరిగా ప్రవర్తించడము; ఈ సత్కార్మ లేకపోయినా ధ్యానంలో మాత్రం ఆ 'ఒకటి'తో ఒకటి కావాలి.

పాశ్చాత్య ఆలోచనా రీతులలో ముఖ్య స్రవంతి దీనికి విరుద్ధంగా ప్రవహించింది. ఇతడు సదాలోచన ద్వారా పరమసత్యాన్ని చేరాలనుకొన్నాడు. కనుక, సత్కార్మ గూడ మంచిదే అనుకొన్నప్పటికీ, ఆలోచనకు ప్రముఖ స్థానాన్ని ఇచ్చాడు. మత వికాసంలో ఇది మూఢ నమ్మకాలకు ఈ నమ్మకం మీద సాగిన అవంతవాద ప్రతివాదాలకు, ఇతర మతాల యెడ అవిశ్వాసానికి దారితీసింది. ఇంకా అది, "దేవునిపై విశ్వాసమే మతానికి ముఖ్యం", అనే నమ్మకానికి దారితీసింది. దీని అర్థం సత్ప్రవర్తనకు చోటు లేదని కాదు. కాని దేవుని విశ్వసించినవాడు దేవుని జీవించక (దేవుని ప్రతిబింబించక) పోయినప్పటికీ - దేవుని నమ్మకుండ దేవుని జీవించిన (దేవుని ప్రతిబింబించిన) వానికంటె గొప్పవాడని భావించాడు.

ఆలోచనకు ప్రాముఖ్యాన్ని ఇవ్వడం వలన చారిత్రకంగా మరొక ముఖ్యమైన ఫలితం వచ్చింది. 'ఆలోచనతో సత్యాన్ని గ్రహించవచ్చు' అనే భావన మూఢ నమ్మకానికే కాక విజ్ఞానశాస్త్రానికి గూడ దారితీసింది. అటు బౌద్ధిక నిజాయితీ (intellectual honesty) నుంచి చూచినా, ఇటు శాస్త్రాన్ని ఆచరణలో పెట్టడం - అంటే సాంకేతిక ప్రక్రియకు అన్వయించడం నుంచి చూచినా విజ్ఞానశాస్త్రానికి సంబంధించినంత వరకు దానికి కావలసిందల్లా సరిగా ఆలోచించడమే.

క్లుప్తంగా చెప్పాలంటే, విరోధాభాసాలోచన సహనానికి ఆత్మ పరివర్తన (self transformation) కు దారితీసింది. అరిస్టాటిల్ దృక్పథం మూఢ విశ్వాసానికి (dogma), విజ్ఞానశాస్త్రానికి, కాథలిక్ చర్చికి, అణుశక్తి కనుక్కోవడానికి దారితీసింది.

దైవప్రేమకు సంబంధించి రెండు దృక్పథాల మధ్య తేడా మూలంగా వచ్చిన ఫలితాలను ఇప్పటివరకు అంతర్లీనంగా తడుముతూ వచ్చాము. ఇప్పుడు వాటిని వివరిద్దాము.

పాశ్చాత్య దేశాలలో ప్రబలంగా ఉన్న మత వ్యవస్థలో దైవప్రేమ అంటే దేవునిమీద నమ్మకము. దేవుని న్యాయబుద్ధిలో, ప్రేమలో నమ్మకము, ఇక్కడ దైవప్రేమ ముఖ్యంగా, ఆలోచనానుభవ (thought experience) మైతే ప్రాగ్దేశ మతాలలో, మార్మికవాదంలో (mystiecism) అది ఏకత్వానికి (oneness) సంబంధించిన తీవ్ర సంవేదనానుభవము. ప్రతి జీవన చర్య లోను ఆ అనుభవం, ఈ ప్రేమాభి వ్యక్తీకరణం విడదీయ వీలులేకుండ ముడిపడి ఉంటాయి. మెయిస్టర్ ఇకార్ట్ ఈ లక్ష్యాన్ని ప్రాథమికంగా ఇలా వివరించాడు: ''అందువలన నేను దేవునిగా మారిపోతే నన్ను అతనిలో ఒకనిగ చేసుకొంటాడు, అప్పుడు సజీవమైన ఆ దేవునితో పోలిస్తే మా యిద్దరి మధ్య తేడా లేదు.... దేవుడు దూరాన ఎక్కడో ఉన్నట్లు తాము ఇక్కడ ఉన్నట్లు భావించి, కొంతమంది దేవుని చూడబోతున్నామనుకొంటారు. కాని అది అలా కాదు. దేవుడు, నేను: మేమిద్దరం ఒకటే. దేవుని తెలుసుకోవడం ద్వారా అతనిని నాలోకి తీసుకొంటాను. దేవుని ప్రేమించడం ద్వారా అతనిలోకి చొచ్చుకుపోతాను.

ఇప్పుడు మనం తల్లిదండ్రుల మీద ఉండే ప్రేమకు దైవప్రేమకు మధ్య ఉన్న ఒక ముఖ్య సాదృశ్యాన్ని చూదాము. ''తల్లి తన ఉనికికే ఆధారం'' అనే భావనతో బిడ్డ జీవితం ప్రారంభమవుతుంది. అతడు నిస్సహాయుడననుకొంటాడు. తల్లి సర్వపరిష్వంగ ప్రేమ అతనికి అవసరము. ఆ తరవాత ఆలోచనకు ఆచరణకు తండ్రి మార్గదర్శకుడు కావడంతో తన ప్రేమాభిమానాలకు అతన్ని నూతన కేంద్రంగా గ్రహించి అతనివైపు మరలుతాడు. ఈ దశలో 'తండ్రి మెప్పును పొందాలి, అతనికి కోపం తెప్పించరాదు' అనే 'అవసరం'తో ప్రేరితుడవుతాడు. వయస్కుడైన తరవాత తలిదండ్రులను రక్షకులుగ శిక్షకులుగ భావించడు. ఈ దృష్టి నుంచి బయటపడతాడు. మాతృసదృశ, పితృసదృశ సూత్రాలను తనలోనే ఆవిష్కరించుకొంటాడు. అతడు తనకు తనే తల్లి, తండ్రి అవుతాడు; అతడు తండ్రి, అతడు తల్లి. మానవజాతి చరిత్రలో ఇదే పరిణామం మనకు కనిపిస్తుంది. లేదా అదే పరిణామం సంభవిస్తుందని ఆశించవచ్చు. దైవప్రేమ, మొదట మాతృదేవతకు నిస్సహాయ బంధంగాను, ఆ తరవాత పితృసదృశ దేవునికి వినమ్ర బంధంగాను ప్రారంభమై, దేవుని బాహ్యశక్తిగా తొలగించి, ప్రేమధర్మ సూత్రాలను తనలోనే ఆవిష్కరించుకొని, దేవునితో తాను ఒకటైన పరిపక్వ దశకు చేరుకొంటాడు. అంతిమంగా, దేవుని ఒక ప్రతీకగా, ఒక పద్యంగా భావించే స్థితి చేరుకొంటాడు.

(సశేషం)

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

Former prime minister VP Singh and other opposition leaders had made several charges against prime minister Rajiv Gandhi in the multi-crore Bofors scandal. Opposition parties blamed the Congress government for justifying the receipt of commissions by the parties involved. Last year, external affairs minister Madhavsinh Solanki had to quit following charges that he had sought to influence the Bofors scandal probe by handing over a note to Swiss foreign minister Rene Felber during his visit to Switzerland

Charges were also levelled against VP Singh by a popular Hindi weekly *Ravivar* that some members of his family deliberately and dishonestly by passed the land ceiling laws by taking advantage of Singh's political clout. However, Singh set a precedent by inviting leaders of the opposition to inquire into the charges to establish whether he was guilty or not.

* * *

Despite being in power for over four decades, the Congress party, instead of setting an example of probity, has encouraged and mastered public dishonesty. The Santhanam Committee on Prevention of Corruption has dwelt at length on ways to create a social climate both among public servants and in the general public in which bribery and corruption may not flourish.

* * *

However, after the Harshad disclosure the joke going round is that "Rs.1 crore by today's corruption standards is a pathetic amount and even that was meant not for 'Raosaheb' but for the party fund."

* * *

But can a seasoned political party like the Congress-I make such grave blunder as to lay such an easy trail? More than the allegations against Rao, what is disturbing is the idea of a stock broker trying to corrupt the highest citizen of the country. If not to the party, he should at least have shown some respect to Prime Minister's post and refrain from proffering his Rs. one crore blandishment.

* * *

**The Antulay case:** During 1980-82, chief minister of Maharashtra A.R. Antulay was accused of raising funds by charging fees for granting licences for sugar, cement and industrial alcohol and was charged of extorting crores of rupees for the trusts founded by him from businessmen and traders. He had to resign following an adverse court verdict.

* * *

**The R.K. Hegde case:** A commission of inquiry headed by supreme court judge Kuldip Singh, set up in 1989, inquired into irregularities in the allotment of 110 acres of land in Bangalore by the Bangalore Development Authority to nonresident Indians and the sale of 22,622 sq. metres of land in Mysore to a private builder during Mr. Ramakrishna Hegde's chiefministership The commission indicted Mr Hegde in its report

* * *

**The Fairfax affair:** A commission of two supreme court judges, Justice M.P. Thakkar and Justice S. Natarajan began probing the Fairfax affair in April 1987. It enquired into the arrangements entered into with the Fairfax Group Inc, an American detective agency, to probe FERA violations and indicted former finance minister, V.P. Singh in its report.

* * *

**The Czech pistol deal:** The CBI registered a criminal case against former minister of state for internal security, Mr. Arun Nehru in April 1989 for causing a loss of Rs 22 crore in the 9mm Czech pistol deal. The case remains unresolved

* * *

**The fodder scandal:** Former Lok Sabha Speaker, Balaram Jakhar accused of promoting the interests of a foreigner friend, Mr. Brady, by waiving import duty in return for 50 fodder-making machines. Mr. Jakhar's outfit, the Bharat Krishak Samaj, allegedly played a dubious role in a deal that relieved the Indian public of Rs. 3.6 crore in taxes and over Rs. 3.5 crore in foreign exchange. Case still pending

* * *

**The HDW deal:** The Indian government purchased two submarines from a West German company under a contract signed in 1981. A seven per cent commission working out to Rs. 30 crore was paid to the Indian agents of HDW under the terms of an open-ended agreement.

* * *

**The Airbus A320 deal:** In April 1990, CBI filed an FIR against senior officials of the union civil aviation ministry and Indian Airlines for the hasty purchase of 31 A-320 aircrafts The officials were charged of bribery and corruption in negotiating the purchase which amounted to Rs 2,500 crore

* * *